# విజయ అనుబంధం

# పీష్వా నారాయణరావువధ

—పులిచెర్ల సుబ్బారావు—



'విజయ' అనుబంధ మాలికలో

వెలువడిన యాభై ఐదవ నవల

విజయ

80. ధనలక్ష్మీ కాలనీ

మద్రాసు-86

# విజయ అనుబంధం

'VIJAYA' SUPPLEMENT No: 63
JANUARY 1981
"PEESHWA NARAYANARAO VADHA"
BY PULICHERLA SUBBARAO

ముఖచిత్రం : గంగాధర్

వెల: చెల్లింపలేనిది

(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు యివ్వబడిన అమూల్య కానుక)



ప్రింటర్స్:
విజయా గ్రాఫిక్స్,
210 - ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026.



# పీష్వా నారాయణరావువధ

పులిచెర్ల సుబ్బారావు

## పూర్వ రంగం

వారసత్వ యుద్ధాలు, గద్దెకోసం దాయాదుల కుట్రలు, అన్నదమ్ముల హత్యాకాండ- ఇవి భారతదేశ చరిత్రలో కొత్తకాదు. మహమ్మదీయ రాజవంశాలలో ఇవి సర్వ సామాన్యం. హైందవ రాజవంశాలలో కూడా భారతయుద్ధం నాటినుండీ ఇవి లేకపోలేదు. కాని సర్వసాధారణంగా జ్యేష్ఠుని హక్కుని మన్నించటం జరుగుతూ వచ్చింది. అలా మన్నించకుండా రక్తపాతానికి దారి తీసిన సంఘటనలు చాలా కొద్ది. అట్టి వానిలో మిక్కిలి దారుణమైనది 1773లో జరిగిన పీష్వా నారాయణరావు వధ. ఈ హత్యనుగురించి తెలుసుకోబోయే ముందు దీని పూర్వరంగం కొంత ప్రస్తావించవలసి వుంది.

మహారాష్ట్ర సామ్రాజ్యపతనం 1761 నుండీ ప్రారంభమైందనే చెప్పాలి. ఆ ఏడు జరిగిన మూడవ పానిపట్టు యుద్ధంలో ప్రముఖ నాయకులు, వీరులు ఎందరో మరణించారు. ఆ దెబ్బకు తట్టుకోలేక పీష్వా బాలాజీబాజీరావు కూడా పరమపదించాడు. అతని జ్యేష్ఠపుత్రుడు విశ్వాసరావు పానిపట్టు వద్ద చనిపోవడంవల్ల, రెండవ

కుమారుడైన మాధవరావు 1761లో తన 17వ ఏట పీష్వా కాగలిగాడు. మాధవరావు పిన్న వయస్సును ఆధారం చేసుకుని, అతని పినతండ్రి రఘునాధరావు తానే పీష్వా కావాలని శాయశక్తులా ప్రయత్నించాడు. కుట్రలు పన్నాడు. కడకు పోరాటాలు సలిపాడు. కాని సమర్థుడై మాధవరావు అతని కుట్రలనూ, కుతంత్రాలనూ భగ్నంచేసి నిలవగలిగాడు. సామోపాయంవల్ల ఎంతకీ దారికి రాని పినతండ్రిని చివరికి బంధించవలసి వచ్చింది. అన్నివిధాల తన పూర్వీకులకు తీసిపోడని నిరూపించుకున్న పీష్వా మాధవరావు దురదృష్టవశాత్తు క్షయవ్యాధికి లోనయ్యాడు. అతనికి సంతానం లేకపోవడంవల్ల, అతని తమ్ముడు నారాయణరావే పీష్వాపదవికి అతని తరువాత వారసుడు కావలసి వుంది. పదిహేడేళ్ళు నిండీ నిండని అనుభవహీనుడైన తమ్ముడు తన తరువాత ఎదుర్కొనబోయే కష్టనష్టాలను మాధవరావు ఊహించగలిగాడు. ముఖ్యంగా, చెఱలో వున్న పినతండ్రి రఘునాధరావువల్ల తమ వంశానికీ, దేశానికీ రాబోయే ముప్పును గూర్చి తలచి, మరణశయ్యపై ఉన్న ఇరవై ఎనిమిదేళ్ళ పీష్వా మాధవరావు తల్లడిల్లాడు.

## అసలు కథ

**1772** నవంబర్ 17వ తేదీ మంగళవారం సాయంత్రం ఐదు గంటలకు....

పీష్వాల ఇలవేలుపు గణేశుడు నిశ్చలంగా జగత్తును పరికిస్తున్నాడు. గణేశుని గుడిముందటి రాజమందిరం అంతటా విషాద చ్ఛాయలు అలుముకుని ఉన్నాయి. మందిరం వెలుపల నానాఫర్నవీసు నిలబడి పుణే దిక్కుగా చూస్తున్నాడు. బక్కపలచని ఆ మేధావి ఆకారం అంతా ఆత్రుతతో అలముటిస్తోంది.

ఉండుండి గుడిలోపలికి అతని దృక్కులు ప్రసరిస్తున్నాయి. విగ్రహం ఎదుట రమాబాయి ఎడితెగని ధ్యానంలో మునిగి వుంది. ఉపవాసాలతోనూ, జపతపాలతోనూ ఆమె సుందరసుకుమార దేహం శుష్కించిపోయింది. ఎందరెన్ని విధాల బ్రతిమాలినా ఆమె మెతుకైనా ముట్టటంలేదు. ఆమె భర్త పీష్వా మాధవురావు గుడి

ఎదుటి భవనంలో మరణవేదనతో కొట్టుమిట్టాడుతున్నాడు.

'ఈ పతివ్రత పూజా ఫలితంగానైనా శ్రీమంతుడు బ్రతికేనా?' నానాఫర్నవీస్ నిట్టూర్చి మళ్ళీ పుణే బాటవైపు దృష్టి సారించాడు. బాట కిరువైపులా చెట్లనీడలు పొద్దువాటారేకొద్దీ సాగిపోతున్నాయే గాని, ఎదురు చూసే వ్యక్తిమాత్రం సాగి రావడంలేదు.

'ఈ సఖారామ్ బాపు ఎప్పుడూ ఇంతే! వెళ్ళిన పని వెంటనే తెముల్చుకురాడు. అసలు ఈయన ఏది చక్కగా చేశాడుగనక?'

- పుణే నగరమందలి శనివార్ వాడాలో బంధింపబడిన రఘు నాథ దాదాను కడసారి చూడాలని పీష్వా కోరిక. రాచకీయాల్లో ఎంత కాఠిన్యం వహించినప్పటికీ ఎంతైనా పినతండ్రి! రక్త సంబంధం ఎక్కడికి పోతుంది?

'రఘునాథ దాదా!'

అతనిపేరు తలచినకొద్దీ నానా రక్తం ఉడుకెత్తి పోతోంది.

పానిపట్టు ఓటమితో పంచబంగాళమైపోయిన మహారాష్ట్ర ప్రభను, పీష్వాపదవికై తను చేసిన కుట్రలతో మరింత దిగజార్చిన వీరుడు. అతన్ని చెఱలో ఉంచటం కాదు- తల తొలిగిస్తే పీడా కాస్తా వొదిలిపోతుంది. కాని పీష్వా అందుకొప్పుకోడు. పైపెచ్చు చివరి నిమిషాల్లో అతనితో ఏదో మాట్లాడాలని తహతహ పడు తున్నాడు.

రఘునాథదాదాను వెంటబెట్టుకు రావడానికే వెళ్ళాడు సఖా రామ్ బాపు.

'చీకటి పడుతోంది. ఇక రాడేమో దాదా?'

అడుగులో అడుగువేసుకుంటూ భవనంలోనికి వెళ్ళాడు నానా ఫర్నవీస్.

"దాదా రాలేదా?" పీష్వా హీనస్వరం వినిపించింది.

"రాలేదు. కాని వస్తూ వుంటారు శ్రీమంత్!"

భారంగా నిట్టూర్చాడు పీష్వా.

అసాధ్యమైన రోగంతో శల్యావశిష్టుడై, అనూహ్యమైన వేదనతో అల్లాడుతున్నా, అణుమాత్రమైన చలించకుండా వున్నా డతడు.

పేరు మోసిన వైద్యులంతా ఓ పక్కన నించుని ముఖాలు వేలవేసి వున్నారు. ఆస్థాన వైద్యుడు బాబావైద్యతోబాటు, గోవా నుండి వచ్చిన పోర్చుగీసు వైద్యుడు డిసీకా, జైపూర్‌నుండి గంగా విష్ణు కలియబలుక్కుని వైద్యం చేస్తున్నా రాజయక్ష్మన్ని రూపు మాపటం వారెవ్వరి తరమూ కావడంలేదు.

పీష్వా తమ్ముడు నారాయణరావు శయ్యానుకుని కూచున్నాడు. ఇరవైనాలుగ్గంటలూ వ్యాధిగ్రస్తుడైన సోదరుని కాచుకుని వున్నాడతడు.

త్రియంబకరావు మామా ఓ ప్రక్కన నించుని నిట్టూర్పులు విడుస్తున్నాడు. ఆ వృద్ధుడు పీష్వాబాజీరావు తమ్ముడైన చిమ్మాజీ అప్పాకు బావమరిది. పానిపట్టులో మరణించిన సదాశివభావోకు మేన మామ. మహారాష్ట్రులంతా అతన్ని ఎంతో ప్రేమగా 'మామా' అని పిలవడం పరిపాటి. సమర్థుడైన సేనాని. దక్షిణాదిన కర్నాటకంలో హైదరాలీ పీచ మణచివేసి, తిరిగొచ్చి నాలుగు నెలలయింది. త్రియంబకరావు పక్కనే హరిపంత్‌ఫడ్కే తలవాల్చి వున్నాడు. హరిపంత్ కూడా మాధవరావు ఆధ్వర్యంలో అనేక యుద్ధాల్లో పాల్గొని పేరు గడించినవాడే.

శయ్యకు కొంచెం దూరంగా స్తంభం చాటున నించుని ఇచ్ఛారావుపంత్, ఛపాజీ తిలేకర్, ఆబాజీపంత్ మున్నగు కార్ఖానులు కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తున్నారు. వారంతా చిన్ననాటినుండీ పీష్వాల గృహాంగణంలో పెరిగి, వారిని ప్రాణ ప్రదంగా సేవిస్తూ ఉన్నట్టివారు.

పీష్వా శయ్యకెదురుగా ప్రధాన న్యాయమూర్తి రామశాస్త్రి గంభీరంగా ఆసీనుడై వున్నాడు. న్యాయశాస్త్రాదులన్నీ ఆవలోకన చేసిన ధిషణాహంకారం అతని ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

కాని నానాఫర్నవీస్ వీరెవ్వరినీ పరికించటం లేదు. అతని చూపులన్నీ పీష్వా పైనే వున్నాయి. పదకొండేళ్ళపాటు మహారాష్ట్ర సామ్రాజ్యానికి ఏడుగడయై నిలిచిన మహావ్యక్తి నేడు మంచం వదల్లేక వున్నాడు. దక్షిణాదిన హైదరాలీని అణిచి, సింధియా, హోల్కార్, గాయక్వాడ్, భాన్స్లేలను ఓ దారికి తెచ్చి, ఢిల్లీ

కోటపై మరాఠీ పతాక జరీపటకాను మళ్ళీ నాటించిన వీరకిశోరం నేడు స్వర్గధామానికి ఎదురు తెన్నులు చూస్తోంది.

"శాస్త్రీబువా!" రామశాస్త్రిని పలకరిస్తున్నాడు పీష్వా.

"ఆజ్ఞ శ్రీమంత్!"

"నాలాంటి పీష్వాలు వస్తారు పోతారు. కానీ న్యాయస్థానం అధికారానికి మాత్రం విఘాతం కలగరాదని నా ఆశయం."

"పీష్వాల పాలనలో ఇంతవరకూ న్యాయానికి ప్రతిబంధకం కలగలేదు శ్రీమంత్! ఇకముందు కూడా కలగదనే నా ఆశ!"

ఇంతలో భవనం వెలుపల కలకలం వినిపించ నానాఫర్నవీస్ తొంగి చూశాడు.

"శ్రీమంత్! దాదాసాహెబ్ వస్తున్నారు."

పీష్వా కళ్ళలో కొత్త వెలుగు కనిపించింది.

సఖారామ్ బాపు, అతని వెనక రఘునాథదాదా లోనికి ప్రవేశించారు. రాజోచితమైన దుస్తులతోనూ, పెద్ద తలపాగాతోనూ మెరిసిపోయే రఘునాధరావు పీష్వా శయ్యను సమీపించాడు.

"ప్రణామం శ్రీమంత్!"

దీనంగా చేతులు మోడ్చి నమస్కరించాడు పీష్వా మాధవరావు.

"దాదాజీ! ఈ మాధవరావు మీ అన్న కుమారుడు! మీకూ కుమారుడే! నా యీ అవసాన దశలోనైనా ప్రేమతో 'బాబూ' అని పిలవకూడదా?"

తన అన్న కుమారుని రోగావస్థ చూసి, అతని దీనమైన పలుకులు విని, కరుణతో రఘునాధరావు కళ్ళలన్నీ కరిగి నీరైనాయి.

"బాబూ! మాధవ్!" అంటూ అతని చేతులు పట్టుకున్నాడు రఘునాధరావు.

"దాదాజీ! రాజనీతి ననుసరించి మీ యెడ నేను చాలా అపరాధాలు చేసి వుండవచ్చు. నన్ను క్షమించండి!"

"లేదు బాబూ! నేను చేసిన తప్పులకు తగ్గ శిక్ష ననుభవించాను. అంతే! అవన్నీ మనస్సులో పెట్టుకోవద్దు."

"దాదాజీ! నేను వెళ్ళిపోతున్నాను. మన పూర్వులు పెంచి పోషించిన మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని కాపాడే బాధ్యత ఇకపై మీదే.

ఇదుగో- నా తరువాత కాబోయే పీష్వా" అంటూ తన పాదాలు పట్టు కుని వున్ననారాయణరావు వైపు చూపాడు.

"వీడిని మీ చేతుల్లో పెడుతున్నాను. నీట ముంచినా పాల ముంచినా ఇక మీదే భారం" అంటూ తమ్ముని చేతులు పినతండ్రి చేతుల్లో ఉంచాడు.

ఆ దృశ్యం చూపి అక్కడున్న వారంతా కంట తడి పెట్టు కున్నారు.

"తమ్ముడూ!"

"అన్నయ్యా!" అన్నాడు నారాయణరావు గద్గద స్వరంతో.

"ఇకపై దాదాజీయే నీకు తల్లీ, తండ్రీ అన్నీ. వారికి తోడు సఖారామ్ బాపు, నానా ఫర్నవీస్ ఉన్నారు. త్రియంబకరావు తాత ఉన్నాడు, హరిపంత్ ఉన్నాడు. నీకేమీ భయం లేదు. ప్రజల్ని కన్నబిడ్డల్లా కాపాడు. పూర్వ సంప్రదాయాలను విడనాడవద్దు. వివేకంతో ప్రవర్తించు. అవసరమైతే కఠినంగా ఉండటానికి వెను కాడవద్దు. పదవిని ప్రమాదం ఎప్పుడూ కాచుకుని వుంటుంది. కను గలిగి వర్తించు. శివాజీ మహారాజు వారి వంశీకులనూ, మొగల్ చక్రవర్తులనూ గౌరవించు. అన్ని విధాలా మన వంశ ప్రతిష్ఠను నిలబెట్టు."

"భావూ! భావూ!" అంటూ పీష్వా పాదాలకు తన శిరస్సును ఆన్చి కన్నీరు మున్నీరుగ విలపింపనారంభించాడు నారాయణరావు.

"పంత్ ప్రధాన్ కాబోయే నీవు ఇలా దుఃఖించరాదు. గంభీ రంగా ప్రవర్తించు" అన్నాడు పీష్వా.

కాని నారాయణరావు దుఃఖం పొంగి పొరలుతోంది.

ఆ రాత్రంతా పీష్వా ఇంతింతనరాని శారీరక వేదనను అను భవించాడు. రఘునాధరావుతో సహా అందరూ ఆ రాత్రంతా మేలు కుని అతని శయ్య ప్రక్కనే ఉన్నారు. భాష్పాలు రాల్చటం తప్ప ఎవరూ ఏమీ చెయ్యలేని స్థితి అది.

రమాబాయి భగవద్ధ్యానం కొనసాగిస్తూనే ఉంది.

మరునాడు సూర్యుడుదయించే తరుణంలో మహారాష్ట్ర భాను

ద స్తమించాడు. రాజమందిరం ఏడుపు పెడబొబ్బలతో దద్దరిల్లి పోయింది.

"దాదా!" అంటూ రఘునాధరావును కౌగిలించుకుని ఏడవ సాగాడు నారాయణరావు. "కన్నతండ్రిలా చూసిన అన్నయ్య కన్ను మూశాడు దాదా!"

ఇరవై ఎనిమిదేళ్ళకే రాలిపోయిన పీష్వా సుందర దేహం చూసేకొద్దీ అందరికీ శోకం అధికరించసాగింది.

గుడిలో ధ్యానం నిలిచిపోయింది.

రమాబాయి సహగమనానికి సిద్ధమైంది. అప్పటి ఆచారం ప్రకారం ఆమె నెవరూ వారించలేదు. నిర్లిప్త ముఖ భావంతో శవం వెంట నడిచి నదీ తీరం చేరింది రమాబాయి. భర్తతో పాటు చితి నెక్కబోయే ముందు తన నగలన్నీ దానం చేసింది.

"బాబూ!" వాత్సల్యంతో నారాయణరావు తల నిమిరింది.

"వదినా!" అంటూ ఆమె పాదాలకు మొక్కాడు నారాయణ రావు.

"మీ అన్నగారి అడుగుజాడల్లో నడుచుకో. వంశ ప్రతిష్ఠను నిలబెట్టు" అంటూ రఘునాధరావు వైపు తిరిగి, "మామగారూ! ఇక నారాయణరావుకు తమరే దిక్కు" అని మరిదిని అతని కప్పగించింది.

తరువాత కన్నీటితో తనకు వీడ్కోలిస్తున్న అశేష ప్రజానీకా నికి నమస్కరించి చిరునవ్వుతో భర్త చితిపై కెక్కింది.

సజీవ నిర్జీవ దేహాలు రెంటినీ అగ్నిదేవుడు క్షణాలపై ఆహరించాడు.

మహారాష్ట్ర చరిత్రలో ఒక యుగం అంతరించింది.

కన్న తల్లిదండ్రుల వలె కాపాడిన అన్నా వదినలు కళ్ళ ముందే బూడిద కావటం చూడలేక నారాయణరావు నిలవిల్లాడి పోయాడు.

రామశాస్త్రి, నానా ఫర్నవీసు మున్నగు వారి హృదయాలు విషణ్ణమైనాయి.

రఘునాధరావు ముఖంలో నిర్వేదం రూపు దాల్చింది.

# 2

"రేపే సతారాకు ప్రయాణం శ్రీమంత్!" అన్నాడు నానా ఫర్నవీస్.

"సతారాకా! ఎందుకూ?" అన్నాడు కొత్త పీష్వా నారాయణ రావు.

"తమ రెరగంది ఏముంది? ఛత్రపతి రామరాజావారి నుండి కొత్త పీష్వా అధికార వస్త్రాలు పొందటం ఆచారం గదా?"

"మంచిది. అలాగే వెళ్దాం నానాజీ!"

"మరి దాదాజీ...."

"వారూ మన వెంట వస్తున్నారు. అవునా?"

"లేదు శ్రీమంత్! తమ అన్నగారు వారి భరణానికై సాలుకు ఐదు లక్షలు ఏర్పరిచారు. కాని దాదాజీవారు ఇప్పుడు దాంతో తృప్తి పడటం లేదు. కనీసం ఇరవై అయిదు లక్షలైనా ఇవ్వందే సతారాకు తోడుగా రానంటున్నారు."

"అయితే దాదాజీకి మా మీద కోపం పోలేదన్నమాట!"

"ఆ ద్వేషభావం వారి నరనరానా జీర్ణించుకుపోయి వుంది శ్రీమంత్! అన్నగారు ఉన్నంతకాలం పీష్వా పదవిపై గల కాంక్షతో వారినీ ఇలాగే వేధించుకు తిన్నారు. వారు పోయాక కూడా వీరు మనస్సు మార్చుకోనట్లు తోస్తోంది."

"అయితే మనం కూడా జాగరూకులమై ఉండక తప్పదు!"

"అంతే కాదు- సతారాకు పోయి వచ్చాక వారికి గృహ నిర్బంధం విధించక తీరదు శ్రీమంత్! ఇదే మన మంత్రులు, సర్దార్లు- అందరి అభిప్రాయం."

"అంత కాఠిన్యం వహించవలసిందేనా?"

"తమ అన్నగారు మరణ శయ్యపై ఉండి చేసిన ఉపదేశం మరిచారా? అవసరమైతే ఎంతటి వారితో నైనా కఠినంగా వర్తించమని చెప్పలేదూ?"

"కానివ్వండి. చూద్దాం. ప్రస్తుతం ఎలాగైనా దాదాజీని సతారాకు వెంట బెట్టుకుని వెళ్తే గౌరవంగా ఉంటుంది."

"వారి నెలాగో సఖారామ్ బాపూ ఒప్పిస్తారు. వస్తుతః రఘునాధ దాదా వారు సజ్జనులే. అనేక దుష్టశక్తులు చేరి వారిని తప్పుత్రోవ పట్టిస్తున్నాయి. మరొక మనవి శ్రీమంత్!"

"సెలవియ్యండి!"

"ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీవారు మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని ఎలానైనా కూలద్రోయాలని కుట్రలు పన్నుతున్నారు. వారి ప్రతినిధి మోష్టిన్ పుణే నగరంలో ఉండి కుతంత్రాలకు నిలయమయ్యాడు. అతగాణ్ణి ఓ కంట కనిపెట్టి ఉంచాలి."

"తప్పక. ముందు సతారాకు ప్రయాణ సన్నాహాలు చేయించండి."

* * *

సతారాకు వెళ్ళి వచ్చిన కొద్ది రోజులకే రఘునాధరావు కుమార్తె దుర్గాబాయి వివాహం మహావైభవంగా జరిగింది.

పీష్వా నారాయణరావూ, అతని భార్య గంగాబాయీ వయసులో చిన్నవారైనా వివాహం దగ్గరుండి వేడుకగా జరిపించారు. ముఖ్యంగా రఘునాధరావు భార్య ఆనందీబాయిని పీష్వా 'అమ్మా' అనీ, గంగాబాయి 'అత్తయ్యా' అనీ సంబోధిస్తూ కలివిడిగా సంచరించారు. పాత పగలన్నీ మరచిపోయి పీష్వా కుటుంబీకులంతా ఎంతో అన్యోన్యంగా మెలిగారు.

పానిపట్టు వద్ద మరణించిన సదాశివభావో భార్య పార్వతీబాయి పెళ్ళి పెత్తనం వహించింది.

"మా అన్నయ్య బాలాజీరావు బ్రతికుంటే ఎంత సంతోషించి ఉండేవాడో!" అంటూ కంటతడి పెట్టుకున్నాడు రఘునాధరావు.

పెద్దన్న విశ్వాసరావు, చిన్నన్న మాధవరావు, సదాశివభావోలను తలచి కళ్ళు చెమ్మగిల్లాయి.

కన్నీటిధారలతో అందరి హృదయాలలోని కక్షలూ కరిగిపోయినట్లే తోచింది. రాజోద్యోగులు, రాజబంధువులు అందరూ ఈ సంఘీభావం చూసి ఉప్పొంగిపోయారు.

కాని ఎవరెంత నిర్మల హృదయంతో వర్తించినప్పటికీ ఆనందీ బాయి మనస్సులో ఘనీభవించిన విద్వేషభావం మాత్రం అణు మాత్రమూ తగ్గలేదు.

పీష్వా నారాయణరావు హోదా తలచినకొద్దీ ఆమె హృదయం భగ భగ మండిపోసాగింది.

మహావీరుడూ, వయస్సులో పెద్దవాడూ అయిన తన భర్త రఘునాథరావును పీష్వా గద్దెపై చూడాలని ఆమె తహతహ.

'పదిహేడేళ్ళు నిండీనిండని నారాయణరావు పీష్వా హోదాలో వెలిగిపోవటం!

తాము చేతకాని అనదల్లాగా భరణం తింటూ మగ్గిపోవటం!

ఏమంత కర్మ పట్టింది?

తమ పక్షానమాత్రం జనం లేరా? సర్దార్లు లేరా? సిపాయిల్లేరా?

బొంబాయిలోని ఇంగ్లీషు కంపెనీ, హైదరాలీ, నిజామాలీ, మధోజీ భాన్స్లే ఇలా ఎందరెందరో తమకు బానిసలు కావటానికి నిలిచి వుండగా తన భర్త అనదవలె పుణేలో ఒదిగి వుండటమా?

తన కూతురు దుర్గాబాయి వివాహం జరుగుతోందన్న సంబరం ఆమెలో ఏ కోశానా కనిపించలేదు. వివాహవేదికపైని అగ్ని హోత్రుని వలెనే ఆమె హృదయంలోని అసూయాగ్ని కూడా మండి పడుతోంది.

# 3

"అవమానం! అవమానం!" అరిచాడు రఘునాథరావు.

"అవమానం కాక మరేమిటి? పీష్వా కావలసిన వారికి నిర్బంధం! అందునా గార్దీ సిపాయీల కాపలా!" ఆనందీబాయి అందుకుంది.

"సర్దార్! తమరిక మిన్నకుండి లాభంలేదు. ఊ అనండి. అంతా చూసుకుంటాను" అన్నాడు తులాజీ పవార్.

తులాజీ పవార్ రఘునాథరావు దాదా నమ్మినబంటు. దాదా

సాహెబ్ పీష్వాగద్దెపై విరాజిల్లితే చూద్దామని పన్నెండేళ్ళనుండీ ఎదురుచూస్తున్న వ్యక్తి. మాధవరావు బ్రతికి వున్నంతకాలం దాదా విషయం తలపెట్టటాని క్కూడా దమ్ములేకపోయాయి. ఇప్పుడు అనుభవహీనుడైన నారాయణరావు అతని దృష్టికి ఆనటంలేదు.

ఆవేశంలో ఉడికిపోతున్నప్పటికీ రఘునాధరావు ఏమీ మాట్లాడలేదు.

"సర్కార్! పీష్వాపదవి ప్రాముఖ్యత తమకు నేను చెప్ప వలసిన పనిలేదు. ఈనాడు యావద్భారత దేశం పీష్వా పాదాలకడ మోకరిల్లుతోంది. అటు సింధియా హోల్కార్లు ఇటు గాయక్వాడ్ ఖాన్స్లేలు పీష్వా ఆజ్ఞలకై ఎదురు చూస్తున్నారు. గుత్తినేలే మురారి రావు ఘోర్పడే తంజావూరు రాజు పీష్వాలకు సామంతులు. ఇక హైదరాలీ, నిజామాలీ, రాజపుత్రులు, అయోధ్య నవాబు మున్నగు వారంతా చౌతు చెల్లిస్తున్నారు. కడకు ఢిల్లీ పాదుషా కూడా పీష్వా కనుసన్నల మెలగవలసిందే. ఇట్టి పీష్వాపదవిని ఒక బాలుడికి కట్ట బెట్టి సర్వసమర్థులయిన తాము నిర్బంధించబడి ఉండటం ఎంత సిగ్గుచేటు!"

"బాగా చెప్పావు తులాజీ! నేనెన్నివిధాల పోరినా వీరిలో చలనం కలగటంలేదు. ఏం- పీష్వా బాజీరావుగారికి బాలాజీరావువలె రఘునాధరావు పుత్రుడు కాడా? తరువాత పుట్టిన నేరానికి ఇక రఘు నాధరావూ, వారి సంతతీ ఎప్పటికీ సేవకులుగానో, ఖైదీలుగానో పడి ఉండవలసిందేనా?" అంది ఆనందీబాయి ఆక్రోశంతో.

"నారాయణరావు నా అన్నగారి కుమారుడు. పైగా మాధవ రావుకూ, రమాబాయికి మాట ఇచ్చాను. ఇప్పుడెలా తప్పించటం?" సాలోచనగా పలికాడు రఘునాధరావు.

"నారాయణరావుగారికి ఎలాంటి హానీ కలిగించనక్కరలేదు సర్కార్! వారిని చెరలో ఉంచి సమస్త సదుపాయాలూ కల్పించ వచ్చు!"

రఘునాధరావు నవ్వులో నిరాశ మెరిసింది.

"ఒక పీష్వాను పుణేనగరంలో బంధించటం అంత తేలికా తులాజీ పవార్?"

"తమ శక్తి తమరెరుగరు సర్కార్! తమకోసం రంగంలో దూకటానికి ఈ నగరంలోనే వేనకువేల సేవకులు కాచుకుని ఉన్నారు."

"ఎంతమంది వున్నా సఖారామ్‌బాపూ, నానాఫర్నవీసు మంత్రాంగం ముందు బలాదూరే గదా?"

"తమ రొక్కసారి కన్ను తెరిస్తే ఇలాంటి బాపూలూ, నానాలూ మాడి మసై పోతారు సర్కార్! మెరికెల్లాంటి అయిదు వేల మంది గార్దీలు మన గుప్పెట్లో ఉన్నారు."

"గార్దీలా!"

"అవును సర్కార్! గార్దీలే. వాళ్ళ నాయకులు మహమ్మద్ యూసఫ్, ఖరక్ సింగ్, బహదూర్ ఖాన్‌లకు మనం ఎంత చెబితే అంత. ఇక మిగిలింది సుమేర్‌సింగ్ ఒక్కడే."

"సుమేర్‌సింగ్ అంటే మన భవనం పహారాదళం నాయకుడు కదూ?"

"అవును సర్కార్! అతడే. అతనికి మీరంటే చాలా భయ భక్తులున్నాయని పసికట్టాను."

"ఏమో! నాకు నమ్మకం లేదు తులాజీ!"

"సర్కార్! అన్ని భయభక్తులూ డబ్బులోంచి పుట్టుకొస్తాయి. ఆర్నెల్ల నుంచీ గార్దీల జీతాలు బకాయి పడివున్నాయి. జీతాల చెల్లింపు కోసం వాళ్ళంతా ఒహటే గందరగోళం చేస్తున్నారు. వాళ్ళ నాయకులు నలుగుర్నీ డబ్బుతో లోబరచుకుంటే చాలు, అన్నీ సక్రమంగా జరిగిపోతాయి."

"వెధవ డబ్బుదేముంది? ఎంతైనా పారేద్దాం. ముందు వాళ్ళతో సంప్రదించు" అంది ఆనందీబాయి.

"సర్కార్‌వారు సెలవివ్వడమే తరవాయి."

రఘునాధరావు ఓ పట్టాన తల వూపలేదు. స్వర్గవాసులైన మాధవరావుకీ, రమాబాయికీ ఇచ్చిన మాట అతని అంతరంగాన్ని వేధిస్తూంది. మరో పక్క పీష్వా గద్దె, ఆ గద్దెకు లోబడిన యావద్భారత దేశమూ అతని మనస్సును బలంగా ఆకర్షిస్తున్నాయి.

"సందేహించకండి. ఇంతకు మించిన అవకాశం మళ్ళీ రాదు. మీరు తర్జన భర్జనలతో ఆలసిస్తే గుంటనక్క నానా పసిగట్టే

స్తాడు. ఆ పైన మన అందరి బతుకులూ కటకటాల వెనకనో, ఉరి కంబాల మీదనో వెళ్ళమారిపోవలసి వస్తుంది" అన్నాడు తులాజీ.

"తులాజీ పవార్! వారి తరఫున నేను అనుమతినిస్తున్నాను. నీ ప్రయత్నం నువ్వు వెంటనే చెయ్యి!" ఆనందీబాయి స్వరం సుదృఢంగా వినిపించింది.

ఆ పైన రఘునాధరావు కూడా నోరు విప్పక తప్పలేదు.

"తులాజీ! మీ ప్రయత్నాలు ఎలా ఉన్నప్పటికీ నారాయణ రావును చెరలో ఉంచటం వరకే పరిమితం కావాలి. అంతకు మించి అతనిపై ఎలాంటి దౌర్జన్యమూ జరపరాదు."

"ఆ జాగ్రత్తలనీ నేను తీసుకుంటాను సర్కార్!" అన్నాడు తులాజీ.

ఆనంధీబాయి ముఖ బింబంపై ఆనందోత్సాహాలు తాండవ మాడాయి. తన భర్త పీష్వా గద్దెనలంకరించి వెలుగొందే దృశ్యం ఊహించి ఆమె శరీరం గగుర్పొడిచింది.

# 4

మహమ్మద్ కోపంతో ఊగిపోతున్నాడు యూసఫ్.

"డబ్బుతో పనిలేదు. అవకాశం కలిపిస్తే చాలు" అన్నాడు పళ్ళు కొరుకుతూ.

"డబ్బుతో పని లేకపోవడమేమిటి? డబ్బుతోనే పని. అడిగినంత డబ్బిస్తేనే పనిచేస్తాం" అన్నాడు ఖరక్‌సింగ్ యూసఫ్‌వైపు కోపంగా చూస్తూ.

"అవును. పైకమిస్తేనే ఏదైనా!" అన్నాడు బహదూర్‌ఖాన్.

"డబ్బు తీసుకోవద్దనటంలేదు. కాని ఆ బచ్చాగాణ్ని నరకటమే ముఖ్యం అంటున్నాను" అన్నాడు మహమ్మద్ యూసఫ్.

"ఏమిటో ఆ కక్ష?"

"పీష్వా మాధవరావు అంతటివాడు నన్ను పొగిడాడు. బహుమతులిచ్చాడు. జన్మలో మాటపడని ఘటాన్ని నన్ను పట్టుకుని. రెండు

రోజులు బద్ధకించానని చెడామడా తిట్టి కొలువులోంచి తీసేస్తాడా? వీడి అంతు చూస్తాను."

గార్దీ నాయకులు ముగ్గురి సంభాషణా ఆసక్తితో వింటున్నాడు తులాజీ పవార్. యూసఫ్ కారణం విన్న తరువాత అతని ఉత్సాహం రెట్టించింది.

"అంతు చూసే అవకాశం నేను కల్పిస్తాను యూసఫ్! అంతే కాదు- మీరెంత వద్దన్నా తగిన ప్రతిఫలం ఇవ్వకమానరు దాదా సాహెబ్. పని సక్రమంగా పూర్తయితే జాగీర్లు కూడా ఇప్పిస్తాను."

"తమ దయ. ఎప్పుడు ముహూర్తం?" అన్నాడు ఖరక్‌సింగ్ ఆత్రంగా.

"త్వరపడకండి. సుమేర్‌సింగ్ కూడా వచ్చాక మాట్లాడు కుందాం."

"ఎప్పుడొస్తాడు?"

"కబురంపాను- వస్తూంటాడు. దాదాసాహెబ్ భవనానికి కాప లాగా అతన్నే నియమించాడు కొత్త పీష్వా. ఎవరికీ అనుమానం కలగకుండా, జాగ్రత్తగా ఎవరికంటా పడకుండా రమ్మని చెప్పాను."

సుమేర్‌సింగ్ రాకకై ఎదురుచూస్తూ కూచున్నారు.

భీకరాకారులైన గార్దీ నాయకుల్ని చూస్తూ, గార్దీదళం పుట్టు పూర్వోత్తరాలను నెమరేస్తూ సుదూర మైదానం వైపు దృష్టి మళ్ళించాడు తులాజీ.

క్రీ.శ. 1752కు ముందు మరాఠీ దండులో గార్దీలంటూ ఎవరూ ఉండేవారు కారు. సలాబత్‌జంగును దక్కన్ సుబాదార్ హోదాలో నిలబెట్టటానికి ఫ్రెంచి కమాండర్ బుస్సీదొర పుదుచ్చేరినుండి పెద్ద పటాలాన్ని హైదరాబాదుకు తీసుకొచ్చాడు. బుస్సీ దళంలోని సిపాయీ లనే గార్దీలనే పేరుతో పిలిచేవాళ్ళు. గార్దీ దళాధిపతులైన ముజఫర్‌ఖాన్ గార్దీ, ఇబ్రహీమ్‌ఖాన్‌గార్దీ ఒకరి తరవాత ఒకరు బుస్సీ కొలువు లొదిలేసి, పీష్వాబాలాజీ బాజీరావు కొలువులోచేరి మహారాష్ట్ర ఫిరంగి దళానికి తర్ఫీదు ఇవ్వటం ప్రారంభించారు. అప్పటినుండీ పుణేలో గార్దీల సంచలనం ప్రారంభమైంది. మూడవ పానిపట్టు యుద్ధంలో ఇబ్రహీమ్‌ఖాన్ మరణించినా, మరాఠీ ఫౌజులో గార్దీల ప్రాముఖ్యం

తగ్గలేదు. నెలజీతాల పద్ధతిపై పఠాన్లు, బొందిలీలు గార్డీదళంలో అధికంగా చేరటం ప్రారంభించాయి. నెల జీతం ఎవరు సక్రమంగా ఇస్తే వారి కొలువు చెయ్యటమే వీరి రివాజు. అంతకుమించి ఎవరి యెడలా ప్రత్యేక విశ్వాసం ప్రదర్శించటం వీళ్ళకు అలవాటు లేదు. క్రూరకర్మలకు వెనుదీయని వాళ్ళవటం మూలాన్న, గార్డీలను చూస్తే అందరికీ హడల్‌గా ఉండేది. కథాకాలం నాటికి ఒక్క పుణే నగరంలోనే దాదాపు 5000 మంది గార్డీ సిపాయిలుండేవారు. వీళ్ళలో ఒక్కో విభాగానికీ సుమేర్‌సింగ్, బహదూర్‌ఖాన్ మున్నగువారు నాయకులు. అర్నెల్ల నుంచీ జీతాలు బకాయీలు పడి ఉండటం వల్ల గార్డీలు మరీ చెలరేగి, పుణే నగరంలో తమ ఇచ్ఛ వచ్చినట్లు ప్రవర్తించటం, ధనికులైన వాళ్ళను బెదిరించి దౌర్జన్యం చేసి డబ్బు వసూలు చెయ్యటం సాగిస్తున్నారు.

తులాజీపవార్ భారంగా నిట్టూర్చాడు.

'మహోన్నత దశలు చవిచూసిన పుణే నగరం కడకు గార్డీ సిపాయీలను చూసి గజగజ వణికిపోవలసి వచ్చింది....

ఏమైనా కానీ, ప్రస్తుతం వీరితో ఉపయోగం ఉంది. కార్యం గట్టెక్కగానే ఇలాంటి ద్రోహుల్ని దాదాసాహెబ్ మాత్రం ఉపేక్షిస్తాడా?'

"సలామ్, తులాజీ సాహబ్!"

ఉలిక్కిపడి వాకిలివైపు తల తిప్పాడు.

మేరుపర్వతంలా నిటారుగా నిలిచివున్నాడు సుమేర్‌సింగ్!

"రా భాయ్! ఇలా వొచ్చి కూచో."

ఓ కుర్చీపై ఠీవిగా కూచున్నాడు సుమేర్‌సింగ్. తక్కిన గార్డీ నాయకుల్ని నిశితంగా పరిశీలించాడు.

"వీరు ముగ్గురూ నీకు తెలుసనుకుంటాను?" అన్నాడు తులాజీ.

"తెలుసు" ముక్తసరిగా జవాబిచ్చాడు సుమేర్‌సింగ్.

"సరే, అసలు విషయానికొద్దాం. నా పథకం ఈ ముగ్గురికి కూడా తెలుసు. వీళ్ళు ఏ సంకోచమూ లేకుండా వొప్పుకున్నారు. అయితే నువ్వు దాదాసాహబ్ భవనం కాపలాదారువు కనక నీ

చెయ్యి లేకుండా ఏమీ జరగదని మాకు తెలుసు, దాదావారికీ తెలుసు. ఇక చెప్పు- నీకేమైనా అనుమానాలుంటే?"

"అనుమానాలు కాదు- కొన్ని షరతులున్నాయి."

"షరతులా?"

"అవును, షరతులే! మీరు బంధించమంటున్నది ఒక సాధారణ వ్యక్తిని కాదు. మహారాష్ట్ర సామ్రాజ్యానికి మూలస్తంభమైన పీష్వాను. ఆసేతుహిమాచలం ఏలుతున్నవారిని సాధారణ సిపాయీలు చెఱపట్టటం మాటలతో పని కాదు. పైగా పీష్వా నారాయణరావు మమ్మల్ని మనసారా నమ్మి ఉన్నారు. అలాంటి వారికి ద్రోహం చెయ్యడానికి అంతరాత్మ అంత తేలిగ్గా వొప్పుకోదు. అంతరాత్మను ఒప్పించడానికి కొంత మూల్యం చెల్లించవలసి వుంటుంది."

సుమేర్‌సింగ్ మాటలకి ఖరక్‌సింగ్, బహదూర్‌ఖాన్‌లు సంతోషించారు.

"ఆ మూల్యం ఎంతో నువ్వే చెప్పు?" అన్నాడు తులాజీ.

"అందరికీ కలిపి కనీసం రెండు లక్షలు" అన్నాడు సుమేర్‌సింగ్.

"మూడులక్ష లిప్పిస్తాను. సరేనా?"

అంతపెద్ద మొత్తం విని గార్డులంతా ఎగిరి గంతేశారు.

"మూడు లక్షలిస్తే పుణే నగరం మొత్తం మసి చెయ్యగలం."

"అంత పని అక్కర్లేదు. ఇంకేమైనా షరతులుంటే చెప్పండి!" అన్నాడు తులాజీ

"ఒకవేళ ఈ సాహసప్రయత్నం నెరవేరకపోతే మా ప్రాణాలకు పూచీ ఏమిటి?" అని సూటిగా ప్రశ్నించాడు సుమేర్‌సింగ్.

ఆ ప్రశ్న వినగానే తక్కిన గార్డుల ముఖాలు వెల వెల పోయాయి.

ప్రయత్నం విఫలం కావటానికి ఆస్కారం ఉందన్న సంగతి ఇంతవరకూ వాళ్ళు ఆలోచించనైనా లేదు.

"నెరవేరకపోవడం అంటూ ఉండదు. ఒకవేళ విఫలం

అయితే మీ ప్రాణాలకు దాదాసాహెబ్ ప్రాణాలు అడ్డం."

"మాటలతో కాదు, హామీకత్తు వ్రాసి ఇవ్వాలి."

"తప్పక వ్రాయించి తెస్తాను. సరేనా?"

గార్డీలంతా అంగీకారసూచకంగా తలలూపారు.

"సమయం చూసి మీకు కబురెడతాను. అప్పటిదాకా ఈ విషయం నరమానవుడికి తెలియరాదు. జాగ్రత్త!" అన్నాడు తులాజీ దిక్కులు చూస్తూ.

# 5

అతడు పెద్దగా నవ్వుతున్నాడు. ఆమె చిరునవ్వు చిందిస్తోంది.

అతడేదో చెవిలో ఊదుతున్నాడు. ఆమె సిగ్గుతో కుంచించుకు పోతోంది.

అతనికి పద్దెనిమిదేళ్ళు. ఆమెకి పదహారేళ్ళు.

అతడు పీష్వా నారాయణరావు. ఆమె అతని భార్య గంగా బాయి.

అన్యోన్య దాంపత్యం.

కాని వాళ్ళిద్దరికీ రోజూ అలా నవ్వుకోడానికీ, ఊసులాడ టానికీ అవకాశం కలగడం లేదు.

పీష్వా పదవి అంటే మాటలా మరి!

సఖారామ్ బాపూ వంటి కార్భారి ఉన్నా, నానా ఫడ్నవీసువంటి గణకులు ఉన్నా, పీష్వా అన్నవాడికి ఊపిరి సలపనంత పని ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది.

మాధవరావు అంతటి సమర్థుడి జీవితాన్ని పదేళ్ళ పదవీ కాలంలో ఆహరించుకుంది పీష్వాగిరీ!

భారతదేశం నలుమూలలనుండీ రోజూ ఎవరో కొందరు ప్రముఖ వ్యక్తులు పీష్వా దర్శనానికి వస్తూనే ఉంటారు.

ఎన్ని కుట్రలు! ఎన్ని కుతంత్రాలు!

ఇక తీరికెక్కడిది?

అయినా నవ దంపతులు! యువతీ యువకులు!

"అత్తగారు ఏమన్నారో విన్నారా?"

అత్తగారంటే నారాయణరావు కన్నతల్లి కాదు. అతని కన్న తల్లి గోపికాబాయి ప్రస్తుతం అన్నీ వదులుకుని నాసిక్‌లో ఉంటూ జపతపాలతో కాలం వెళ్ళబుచ్చుతోంది.

అత్తగారంటే పార్వతీబాయి. పానిపట్టు వద్ద వీరశయనం పొందిన సదాశివభావ్ భార్య. పీష్వా నారాయణరావు ఆమెకు దత్త పుత్రుడు. ప్రతి విషయమూ ఆమెతో సంప్రదించనిదే చెయ్యడు పీష్వా.

"మా అమ్మ ఏమంది?"

"పుట్టబోయే బుల్లి పీష్వాకు సదాశివరావు అని పేరు పెట్టాలిట!"

"అమ్మ మాటకి తిరుగేముంది? కాని నాదో సందేహం!"

"ఏమిటో శ్రీమంతులవారి సందేహం?"

"ఆడపిల్ల అయితేనో?"

"ఎప్పటికీ కాదు."

"ఎలా తెలుసు?"

"అత్తగారు చెప్పారు. వారి మాట తప్పదుట!"

"తప్పకపోతే మంచిదే! ఇంతకీ పిన్నమ్మగారి మందిరానికి వెళ్ళివచ్చావా?"

"అంటే ఆనందీబాయి అత్తగారి దగ్గరకేనా?"

"అవును. రోజూ వెళ్ళి పలకరించి రమ్మని చెప్పలేదూ?"

"వెళ్ళాను గాని ఇక మీదట వెళ్ళటం నా వల్ల కాదు బాబూ!"

"ఎందుకో?"

"ఎంత వినయంగా మాట్లాడినా ఆవిడగారు కారాలు మిరియాలు నూరుతూ సూటిపోటి మాటలు అంటూనే ఉన్నారు. ఎంతని ఓర్చుకోను? మీరైనా వారి గృహ నిర్బంధం తొలగించకూడదూ?"

"రాచకీయాలు నీ కర్థం కావులే గంగా! నాకు మాత్రం దాదా సాహెబ్ మీదా, పిన్నమ్మగారి మీదా ప్రేమలేక కాదు. కావి వాళ్ళను విచ్చలవిడిగా వాదిలేస్తే మనకే కాదు, మహారాష్ట్ర సామ్రాజ్యానికే

సీళ్ళు తెస్తారు. అందుకే నానాఫర్నవీసు వారిని గృహ నిర్బంధంలో ఉంచారు."

"అటు చూడండి. ఆవిడగారు మన ఇద్దరి వైపూ ఎంత క్రోధంగా చూస్తూందో!"

నారాయణరావు ప్రక్క మేడపై నించుని వున్న ఆనందీ బాయిని గమనించాడు. రఘునాధదాదా ఆ పక్కనే హుక్కా పీలుస్తూ కూచున్నాడు. అతని ఎదుట నించున్న వ్యక్తి ఎవరో నారాయణరావు వెంటనే గుర్తించలేక పోయాడు.

"మనం ఆ వైపు చూడకూడదు గంగా! వాళ్ళు పెద్దలు. వాళ్ళు ఎలా చూపినా ఏం చేసినా మనం భరించాలి" అంటూ భార్యను లోపలి గదిలోనికి తీసుకునిపోయాడు పీష్వా.

ఇద్దరూ పార్వతీబాయి గదిలోనికి వెళ్ళారు.

జ్ఞానేశ్వరి పఠనం ఆపి వాళ్ళ వైపు చూపింది పార్వతీబాయి. "బాబూ, నారాయణా! నీ పద్ధతి నాకేమీ నచ్చలేదు."

"నేనేం తప్పు చేశానమ్మా?"

"నువ్వొక పీష్వావన్న సంగతి మర్చిపోవద్దు. నీకు హాని కలిగించటానికి ఎందరో శత్రువులు కాచుకుని వుంటారు. అందువల్ల భనవం రక్షణ ఏర్పాట్లు కట్టుదిట్టంగా చెయ్యాలని లక్షసార్లు చెప్పాను. కాని నువ్వేమీ పట్టించుకున్నట్లు కనబడటం లేదు."

"నాకు శత్రువులెవరున్నారమ్మా?"

"మరీ అంత అమాయకంగా మాట్లాడకు బాబూ! ఆ మహాతల్లి ఆనందీబాయి ఒకటి చాలు మన పాదు పెకలించటానికి."

"దాదాసాహబ్ అంత ఘోరం చేస్తాడంటావా అమ్మా?"

"మీ దాదా మంచివాడే కావొచ్చు. నేను మాట్లాడేది అతని భార్య ఆనందీబాయిగారి కుట్రల విషయం! ఊరంతా ఏమిటేమిటో పుకార్లుగా ఉన్నాయని తెలిపింది."

"ఏమిటమ్మా ఆ పుకార్లు?"

"అవన్నీ ఎందుకిప్పుడు? మన జాగ్రత్తలో మనం ఉంటే మంచిది. సఖారామ్ బాపూ, నానాఫర్నవీసులతో ఓసారి మాట్లాడు.

"అలాగేనమ్మా!" అంటూ నారాయణరావు బయటికి వెళ్ళి పోయాడు.

తల్లీ కొడుకుల సంభాషణ వింటున్న గంగాబాయి భయంతో కంపిస్తూ పార్వతీబాయి పక్కన కూచుంది.

"మరేం ఫరవాలేదమ్మా! భయపడకు. అన్నిటికీ మన ఇలవేలుపు గణేశుడే ఉన్నాడు" అంటూ కోడలు తల నిమిరింది అత్త.

నెమ్మదిగా జ్ఞానేశ్వరి పఠనంలో మునిగిపోయింది పార్వతీబాయి, ఆ గీతావ్యాఖ్య వింటూ ఉన్నదన్న మాటేగాని గంగాబాయి మనస్సు మనస్సులో లేదు.

# 6

"కీర్తి శేషులైన పీష్వా బాజీరావుగారి ద్వితీయపుత్రుడు రఘునాధ దాదా గార్డీ నాయకులైన సుమేర్‌సింగ్. మహమ్మద్ యూసఫ్' ఖరక్‌సింగ్, బహదూర్‌ఖాన్‌లకు వ్రాసి యిచ్చిన పూచీ కత్తు దుష్పరిపాలన చేయుచున్న పీష్వా నారాయణరావును మీరు పట్టుకొనవలసినది (ధరావే) ఇందుకు ప్రతిఫలముగా మూడు లక్షల రూపాయలు చెల్లింపగలవాడను. ఈ చర్యకు సర్వవిధముల నేనే బాధ్యుడను-రఘునాధరావు దాదా."

తులాజీ తెచ్చి ఇచ్చిన పూచీ కత్తును ఒకటికి రెండు సార్లు దీక్షగా చదువుకున్నాడు సుమేర్‌సింగ్. తక్కిన ముగ్గురు గార్డీలు కూడా శ్రద్ధగా చదివి తృప్తి పడ్డారు.

"ఇక మీ సందేహాలన్నీ తీరినట్లేనా?" అన్నాడు తులాజీ.

"తీరినట్లే. ఇక దాదాసాహబ్ ఆజ్ఞ ఒక్కటే తరువాయి" అన్నాడు యూసఫ్.

"త్వరపడకండి" అన్నాడు సుమేర్‌సింగ్.

"నీ అనుమానాలకు అంతులేదా భాయ్?" అన్నాడు తులాజీ అసహనంతో.

"ఒక్క అనుమానమే మిగిలి వుంది?" అన్నాడు సుమేర్‌సింగ్ విదానంగా.

"ఏమిటది?"

"మీ మహారాష్ట్ర భాషలో 'ధరావే' అంటే పట్టుకొనవలసినది అనే గదా అర్థం?"

"అవును. పట్టుకుని చెరలో ఉంచమని అంతరార్థం."

"కావొచ్చు. కాని పీష్వాలు బ్రాహ్మణులైనా, వారిది వీర వంశం. బాజీరావు, బాలాజీరావు, సదాశివరావు, చిమ్మాజీ అప్పా, మాధవరావు, రఘునాధరావు అందరూ కత్తి పట్టి కదనరంగంలో నిలిచినవారే. అవునా?"

"ఇది అందరికీ తెలిసిన విషయమే గదా?"

"ఆ వంశంలోనే ఇప్పటి పీష్వా నారాయణరావు కూడా జన్మించాడు. ఎంత బాలుడైనా లేశమైనా పరాక్రమం ఉండకపోదు. కత్తో, కర్రో తీసుకుని పోరాడక మానడు. అట్టి పరిస్థితిలో వారి కెలాంటి గాయాలూ తగలకుండా పట్టుకోవటంఅనేది జరిగేపనికాదు."

"ఇది ఆలోచించవలసిన విషయమే!" అన్నాడు ఖరక్‌సింగ్.

"పీష్వాకు ఏదైనా హాని కలిగితే ఆ తరువాత మమ్మల్ని నిందించి ప్రయోజనం లేదు" అన్నాడు బహదూర్‌ఖాన్.

"పెద్ద చిక్కే తెచ్చి పెట్టారే! మరిప్పుడేం చెయ్యమంటారు? అదీ మీరే చెప్పండి" అన్నాడు తులాజీ.

"మరేం లేదు. వీలయినంత వరకూ పీష్వాకు దెబ్బలు తగల కుండానే బంధిస్తాము. కాని ముందు జాగ్రత్త ఎందుకైనా మంచిది. కాబట్టి, ఈ పత్రంలో 'ధరావే' బదులు 'మారావే' (చంపవలసినది) అని మీ మరాఠీ భాషలో వ్రాయించి తీసుకు రండి" అన్నాడు సుమేర్‌సింగ్.

"అమ్మో! అంత పని చెయ్యడానికి దాదాసాహబ్ ఒప్పు కుంటారా?"

"అంత పని చెయ్యడానికి కాదయ్యా మహాప్రభూ! అంత మాట వ్రాస్తే చాలు. మాకు గుండె ధైర్యం ఉంటుంది. మేము మాత్రం పీష్వాను చంపాలని కోరుకుంటున్నామా ఏమిటి?"

"ఏమో! దాదాసాహబ్ అలా వ్రాస్తారని నాకు నమ్మకం లేదు."

"అయితే మేమూ అలా చేస్తామని నమ్మవద్దు!"

"సరే, ఉండండి. ప్రయత్నించి వస్తాను" అంటూ తులాజీ ఆ పత్రం తీసుకుని దాదా వారి భవనం దారి పట్టాడు. మొదటి నుండీ రఘునాధరావు సేవకుడు కావటం వల్ల అతన్నెవరూ అటకాయించరు.

భవనాంతర్భాగంలో ఆనందీబాయి ఎదురైంది.

"వాళ్ళు ఒప్పుకున్నారా తులాజీ?" అని అడిగింది ఆత్రంగా.

"ఒక్క మాట దగ్గర పేచీ వచ్చింది బాయి సాహేబ్!"

"ఏమిటో ఆ మాట?"

"ఎందుకైనా మంచిది 'ధరావే' ను 'మారావే' గా మార్చమంటున్నారు గార్దీలు. అందుకే సర్కార్‌తో సంప్రదించాలని వచ్చాను."

"వారు నిద్ర పోతున్నారు. ఒకవేళ లేచినా అలా మార్చటానికి ఒప్పుకోరని నీకు తెలుసు గదా?"

"తెలుసు బాయిసాహేబ్!"

"ఇలాంటి చిన్న విషయాలు వారితో సంప్రదిస్తే నెరవేరవు తులాజీ! ఇంతకీ గార్దీలు చెప్పే దాన్లో న్యాయం ఉంది. నా ఉద్దేశ్యంలో మారావే అని స్పష్టంగా రాయటమే కాదు. అలా చేస్తేనే మంచిది."

"మరి సర్కార్...."

"అన్నీ సక్రమంగా నెరవేరాక వారు మాత్రం ఏమంటారు? ఏమీ భయపడకండి! ఏదీ ఆ పత్రం నేనే దిద్దేస్తాను" అంటూ తులాజీ చేతిలోంచి పత్రం లాక్కుంది. 'ధ' అన్న అక్షరాన్ని 'మా' అన్న అక్షరంగా దిద్దివేసింది.

"వెళ్ళి నిర్భయంగా వాళ్ళకు చూపించు. ఈ సత్కార్యం వీలైనంత త్వరలో పూర్తివెయ్యటం నీ వంతు" అంది స్ఫుటంగా.

ఆనందీబాయి ఆత్మస్థైర్యాన్ని లోలోన మెచ్చుకుంటూ పత్రాన్ని వస్త్రాల్లో దాచి భవనంనుండి బయటపడ్డాడు తులాజీ.

స్త్రీ సాహసం ఎంతకైనా దారి తీయగలదని అతడిప్పుడు గట్టిగా నమ్మాడు.

# 7

**1773** ఆగస్టు 30 వ తేదీ సోమవారం ఉదయం చాలా పొద్దెక్కి నిద్రలేచాడు పీష్వా నారాయణరావు. గబగబా కాలకృత్యాలు తీర్చుకుని దర్బారు హాల్లోకి వచ్చేసరికి హరిపంత్ కాచుకుని ఉన్నాడు.

"ఏమిటి విశేషాలు పంత్?"

"శ్రీమంతులవారు మరిచినట్లున్నారు. ఈ ఉదయం రఘోజీ అంగ్రేను కలుసుకోవలసి వుంది."

"ఎంత పొరపాటు! వెళ్దాంపద. ఇప్పటికే బాగా పొద్దెక్కింది."

హరిపంత్ తోడురాగా పుణేనగరం వెలుపల విడిసివున్న రఘోజీ అంగ్రే శిబిరాలకు బయలుదేరాడు పీష్వా.

మహారాష్ట్రదేశపు నావికాదళం సర్దారు రఘోజీ అంగ్రే. కొంకణ తీరం అంతా అతని చేతుల్లో వుంది. అంగ్రేలు సామాన్యులు కారు. వందేళ్ళనుండీ జంజీరాసిద్దిలకూ, పోర్చుగీసువారికీ, ఇంగ్లీషువారికీ సింహస్వప్నమై చెలువొందినవారు. పీష్వాల మూల పురుషుడు బాలాజీ విశ్వనాథ్ నుండి మాధవరావు వరకూ అంగ్రేలతో అవినాభావ సంబంధంతో వర్తించారు.

రఘోజీ నాలుగురోజుల క్రిందటే పుణేకు వచ్చి పీష్వా నారాయణరావును సందర్శించి నజరానా చెల్లించాడు. మర్యాదకోసం మళ్ళీ ఈనాడు అతన్ని సందర్శించవలసివుంది పీష్వా.

నారాయణరావు అల్లంత దూరాన ఉండగానే పాదచారియై ఎదురేగి సగౌరవంగా శిబిరానికి తోడ్తెచ్చాడు రఘోజీ అంగ్రే.

కుశలప్రశ్నలయ్యాక ఇద్దరూ ఒంటరిగా తీరిగ్గా కొలువుదీరారు.

"ఒక్క మనవి శ్రీమంత్!"

"సెలవివ్వండి అంగ్రే సాహబ్!"

"తమరిలా ఒంటరిగా విచ్చేయటం శ్రేయస్కరం కాదు."

"నాతోబాటు హరిపంత్ కూడా రావటం మీరు చూడలేదా?"

"మహారాష్ట్ర సామ్రాజ్యానికి పీష్వా అయిన తమకు ఒక్క హరిపంత్ రక్షణ సరిపోతుందా శ్రీమంత్? నేను పుణేకు వచ్చి నాలుగు రోజులైంది. ఈ నాలుగు రోజుల్లోనూ ఎన్నెన్నో వదంతులు వింటున్నాను."

"అందరూ వదంతులు వదంతులు అంటున్నారుగాని ఆ వదంతులేమిటో చెప్పిన వారు లేరు. మీరైనా చెప్పండి."

"తమ శ్రేయస్సుకంటే మాకు కోరదగినదేదీ లేదు. కనుక తప్పక చెబుతాను. తమ పినతండ్రి రఘునాథదాదాగారూ, వారి సతీమణి ఆనందీబాయమ్మగారూ తమను బంధించటానికి కుట్ర పన్నుతున్నట్లుగా వింటున్నాం. గార్దీలు అందుకు సిద్ధంగా ఉన్నారట కూడా కనుక తమరు వీలైనంత జాగ్రత్తగా మెలగాలి. మహల్‌లో ఉన్నా, వెలుపలికి వచ్చినా ఎల్లప్పుడూ తగినంత సిబ్బందిని వెంట ఉంచుకొనడం మంచిది."

"మీ సలహాకు కృతజ్ఞుణ్ణి రఘోజీ! ఇకపై తప్పక తగు జాగరూకతతో ఉంటాను.'

"శ్రీమంతులవారు మన్నిస్తే మరొక్క చిన్న సలహా ఇవ్వగలను."

"నిస్సంకోచంగా చెప్పండి!"

"ఇన్నిటికీ మూలమైన దాదాపై న్యాయవిచారణ జరిపించి మరణదండన విధిస్తే ఆపైన ఇలాంటి భయాలు ఏవీ ఉండవుగదా?"

"దాదాజీకి మరణ శిక్ష?"

"తప్పులేదు శ్రీమంత్! ఇది రాజనీతి. మహమ్మదీయ పాదుషాలు చూడండి. తక్తుకు అడ్డం వస్తారని అనుమానం కలిగితేసరి అన్నదమ్ములనయినా నిష్కారణంగా చంపించి మార్గం నిష్కంటకం చేసుకుంటారు. మీరూ ఆ పద్ధతి అవలంబిస్తే దోషమేమిటి?"

"ఈ నారాయణరావు అంత దారుణం చెయ్యలేడు రఘోజీ! నారాయణరావే కాదు. మా వంశంలో ఇంతవరకు ఎవరూ అలాంటి ఘోరానికి పాల్పడలేదు. ఇకపై పాల్పడబోరు కూడా మా తాతగారు బాజీరావుగారిని వారి సోదరులు చిమ్మాజీ అప్పాగారు భక్తిశ్రద్ధలతో సేవించారు. మా నాన్నగారు బాలాజీరావుగారిని దాదాజీ, సదాశివరావు

గారూ ఎంతో వినయవిధేయతలతో అనుసరించారు. మా అన్నగారు మాధవరావు పీష్వా దాదాజీగారి దుష్కృత్యాలనన్నిటినీ పదకొండేళ్ళు భరించారు, కాని వారి ప్రాణాలు తియ్యటానికి ప్రయత్నించలేదు. నేను మాత్రం అలాంటి దుష్కృత్యం ఎలా చెయ్యగలను?"

"రాజనీతిని ఉటంకించాను. ఆ పైన తమ చిత్తం."

"నొచ్చుకోకండి రఘోజీ! తమ సూచన ప్రకారం ఇకపై అన్ని జాగ్రత్తలూ తీసుకుంటాను"

"ఏది ఎలా ఉన్నా తమరు క్షేమంగా ఉండటమే మాకు కావలసింది. మీ పూర్వులు ఆశించిన హిందూ పద్ పాద్ షాహి మీరు నెలకొల్పుతారనీ, మీకాలంలో మన జరీపటకా ఆసేతుహిమాచలం రెపరెపలాడుతుందనీ కొండంత ఆశతో ఉన్నాము."

"మీ అభిమానానికి సర్వదా కృతజ్ఞుణ్ని. మహారాష్ట్ర సామ్రాజ్యాభివృద్ధికై నా శాయశక్తులా ప్రయత్నిస్తాను."

రఘోజీఅంగ్రేకడ సెలవు తీసుకుని శిబిరంనుండి వెలుపలికి వచ్చాడు పీష్వా నారాయణరావు. హరిపంత్‌తో కలిసి పార్వతి గుడికి వెళ్ళి ప్రసాదం పుచ్చుకున్నాడు.

ఇద్దరూ నగరంలోని భవనంవైపు బయలుదేరారు.

"పంత్!రఘోజీ ఏమన్నారో తెలుసా?"

"సెలవివ్వండి శ్రీమంత్!"

"దాదాజీ, పిన్నమ్మ ఇద్దరూ నన్ను బంధించటానికి కుట్ర పనుతున్నారట! గార్దీలు అందుకు సిద్ధంగా ఉన్నారట!"

"ఈ పుకారు ఊరంతా వ్యాపించి వుంది శ్రీమంత్! తమ ఆజ్ఞ అయితే తగు జాగ్రత్తలు తీసుకుంటాను. ముఖ్యంగా దాదాసాహెబ్ భవనం పహారాదారు సుమేర్‌సింగ్‌గార్దీని తొలగిస్తాను."

"ఎవరెన్ని చెప్పినా సుమేర్‌సింగ్‌పై సందేహం కలగటం లేదు."

"అలా సెలవియ్యవద్దు శ్రీమంత్! తులాజీపవార్ గార్దీలతో చెవులు కొరకటం, దాదాసాహెబ్ మందిరంలోనికి తరచు రాకపోకలు చెయ్యటం చాలామంది చూశారు."

"సరే. చేసే ఏర్పాట్లు ఏవో వెంటనే చెయ్యండి."

"ఈ మధ్యాహ్నం స్నేహితుని ఇంట్లో విందు ఉంది. అది కాగానే వచ్చి ముందు గార్దీలను తొలగించి ఆ తులాజీని ఖైదు చేస్తాను శ్రీమంత్!"

"మంచిది. వెళ్ళిరా."

హరిపంత్ పీష్వా సెలవు పుచ్చుకుని మలుపు తిరిగాడు.

పీష్వా నారాయణరావు మిక్కిలి వేగంగా భవనం చేరాడు.

# 8

"కొంప మునిగిపోయింది" అంటూ గస పెట్టుకుంటూ వచ్చాడు తులాజీ.

"ఏమైంది? ఎందుకలా ఆదరాబాదరాగా వచ్చారు?" అన్నాడు ఖరక్‌సింగ్.

గార్దీలంతా వేగిరపాటుతో తులాజీ చుట్టూ మూగారు.

"అంతా క్షణాలమీద జరిగిపోవాలి. లేకపోతే మన అందరి పీకలూ తెగడం ఖాయం."

"ఏం జరిగిందో చెప్పకుండా ఏమిటా తత్తర?" సుమేర్‌సింగ్ గద్దించాడు.

"ఇంకేముంది? మనపథకంఅంతా పీష్వాకు తెలిసిపోయింది."

"ఆ!" అంటూ గార్దీలంతా భయంతో కొయ్యబారి పోయ్యారు.

"ఇంతకుముందే రఘోజీ అంగ్రే పీష్వాను హెచ్చరించాడట! గార్దీలనందర్నీ తొలగించమని పీష్వా హుకుమ్ జారీ చెయ్య బోతున్నాడట."

"ఇదంతా మీకెలా తెలిసింది?" అన్నాడు బహదూర్‌ఖాన్.

"దాదాసాహెబ్ వేగులులేని ప్రదేశం పుణే చుట్టుప్రక్కల ఎక్కడా లేదు."

"అయితే ఇప్పుడు మనం ఏం చేద్దామంటారు?"

"ఏముంది? హరిపంత్ పీష్వా భవనానికి వచ్చేలోగానే అన్నీ జరిగిపోవాలి. త్వరపడండి!"

అప్పటివరకూ వున్న గార్డీల పూనికా, ధైర్యమూ అంతా మొన మీదికి వచ్చేసరికి నీరుగారిపోయాయి. అందువల్లనే ఉలుకూ పలుకూ లేకుండా నిలిచిపోయారు.

"ఏం మాట్లాడరు? ఇప్పుడు బెదిరిపోతే లాభం లేదు. మీకు ముట్టే మూడు లక్షలూ అలా వుంచి, విషయం ఎలాగూ బయట పడిందిగనక మీ పీకలు తెగటం మాత్రం నిశ్చయం" అన్నాడు తులాజీ నిశ్చలంగా.

సుమేర్‌సింగ్ ఓ క్షణం తల పంకించాడు. దాదాజీ ఇచ్చిన పూచీకత్తు ఓసారి పరికించాడు.

"సరే-కానివ్వండి!" అంటూ తక్కిన ముగ్గురూ వెంట రాగా కదిలాడు.

ఐదువందలమంది మెరికల్లాంటి గార్డీ సిపాయీలు వారి ననుసరించారు.

మిట్టమధ్యాహ్నపు ఎండకు అందరిచేతుల్లోని కృపాణాలూ తళతళ మెరుస్తున్నాయి.

అందరూ పీష్వా మందిరం పెరటి గుమ్మం తోసుకుని ఒక్క-సారిగా లోనికి ప్రవేశించారు.

"ఏమిటీ ఆగడం? ఆగండి!" అంటూ గుమ్మం దగ్గర జమేదార్ బుధసింగ్ వారిని అటకాయించాడు.

"మారో బేఉకో!" అరిచాడు మహమ్మద్ యూసఫ్.

క్షణమాత్రంలో గార్డీలు బుధసింగునూ, తక్కిన ద్వార పాలకుల్నీ నరికేశారు.

ఈ కలకలం విని భవన ప్రాంగణంలోని దఫ్తరీనుండి గుమాస్తాలు, నౌకర్లు బిలబిలమంటూ బయటికొచ్చారు. అప్పటికే గార్డీలు సుమేర్‌సింగ్ నాయకత్వంలో తోసుకొస్తున్నారు.

"ఎంత గార్డీలయితే మటుకు ఇంత దౌర్జన్యమా?" అన్నాడు ఇచ్ఛారావుపంత్.

"ఆర్నెల్లనుండి జీతాల్లేవు" అన్నాడు బహదూర్‌ఖాన్.

"జీతాల విషయం అంతా నానాఫర్నవీసుగారు చూసుకుంటారు. వారి దఫ్తర్ దగ్గరకు వెళ్ళండి."

"మేము పీష్వాని కలుసుకోవాలి."

"వీలుపడదు. శ్రీమంతులవారిప్పుడు నిద్రపోతున్నారు."

"ఏమిటి గుమాస్తాగాళ్ళతో మాటలు? పదండి లోపలికి!" అరిచాడు ఖరక్‌సింగ్.

లోపలికి తోసుకొచ్చే గార్డీలకు అడ్డంగా నిలుచున్నారు గుమాస్తాలు. మహమ్మద్ యూసఫ్‌కు పట్టరాని కోపం వచ్చింది.

"నరకండి కొడుకుల్ని" అని అరిచాడు.

గార్డీలు గుమాస్తాలను నిమిషాలమీద నరికివేశారు. ఇచ్ఛారావు పంత్ పరుగుపరుగున ప్రాంగణంలో కట్టివేయబడిన ఆవు చాటున ఒదిగాడు.

అయినా వొదల్లేదు గార్డీలు. ముందు అవును ముక్కలుచేసి, తరవాత ఇచ్ఛారావును ఖండించారు.

బ్రాహ్మణ ప్రభువైన శ్రీమంత్‌పంత్ ప్రధాన్ నారాయణ రావు హవేలీ ప్రాంగణం గోరక్తంతోనూ, బ్రాహ్మణ రక్తంతోనూ అలికినట్లైంది.

ఈ ఘనకార్యంతో గార్దీలందరికీ వీరావేశం ముంచుకొచ్చింది.

ఉరుకులు పరుగులతో వచ్చి హవేలీ ముఖద్వారం బంధించారు. ఖడ్గాలు భీషణంగా ఝళిపిస్తూ, హవేలీ అంతా దద్దరిల్లేట్లు ఘోష పెడుతూ లోనికి జొరబడ్డారు.

"పీష్వా ఎక్కడ? ఎక్కడ పీష్వా?" అనే అరుపులు విని భవనంలోని పరిచారకులంతా ఆర్తనాదాలు చెయ్యటం ప్రారంభించారు. కాని గోవుగతీ, బ్రాహ్మణ గుమాస్తాగతీ కళ్ళారా చూశాక వారినడ్డుకొనడానికి ఎవరూ ముందుకు రాలేకపోయారు.

గబగబా మెట్లెక్కి పై అంతస్తు చేరారు గార్డీలు.

"నేను బ్రతికుండగా మీరు శ్రీమంతుని తాకలేరు" అంటూ పీష్వా గది దగ్గర కాపలా ఉన్న ఆబాజీపంత్ కార్ఖాన్ కత్తి దూసి వారికెదురుగా నిలిచాడు. కాని రెండు నిమిషాల్లో అతడుకూడా గార్డీల కత్తులకెరయైనాడు "శ్రీమంత్! త్వరగా తప్పుకు పొండి" అని అరుస్తూ మరణించాడు ఆబాజీపంత్.

ఈ కోలాహలంతో, అప్పుడే కునుకు పట్టిన పీష్వా నారాయణరావు మేల్కొన్నాడు. 'ధరా', 'మారా' (సట్టుకోండి, చంపండి!) అనే కేకలూ, ఐదువందలమంది పాదఘట్టనలూ ఒక్కసారి వినబడి, ఆపాదమస్తకం కంపించిపోయాడు. దిక్కుతోచని వెర్రిభయంతో ఉన్నపళాన నిరాయుధంగా వెనుక వాకిలిగుండా పెంపుడుతల్లి పార్వతీబాయి మందిరానికి పరుగుతీశాడు. గంగాబాయి కూడా ఆమె దగ్గరే ఉంది. హఠాత్తుగా చెలరేగిన కలకలం విని వారిద్దరూ విస్తుపోయి చూడసాగారు.

ఇంతలో నారాయణరావు భయవిహ్వలుడై పరుగెత్తుకు రావడం కనిపించింది. తన భర్తను ఆ స్థితిలో చూసి భయంతో గంగాబాయికి ముచ్చెమటలు పోశాయి.

"ఏమిటి బాబూ! ఏమైంది?" పార్వతీబాయి ఆత్రంగా అడిగింది.

"నన్ను చంపడానికొస్తున్నారమ్మా!" భయాధిక్యంవల్ల అంతకుమించి నోరు పెగల్లేదు పీష్వాకి.

గంగాబాయి గుండె బాదుకుంటూ బిగ్గరగా ఏడవసాగింది.

"ఎవరు బాబూ?"

"గార్దీలు! ఇప్పుడెలా తప్పించుకోడం?"

ఈలోగా—"అడుగో పీష్వా! పట్టుకోండి" అన్న కేకలు వినిపించాయి. ఆ కేకలతో భయం మరింత అధికరించి వెర్రి చూపులు చూస్తూ దిక్కులు చూడసాగాడు నారాయణరావు.

"బాబూ! త్వరగా వెళ్ళి మీ దాదాజీ కాళ్ళు పట్టుకో! కావాలంటే పీష్వా పదవి అతన్నే వహించమను. ఊ....చప్పున వెళ్ళు."

"బాబోయ్! అక్కడి కెళ్ళొద్దు" అని గంగాబాయి అరుస్తున్నా లెక్కించకుండా గణేశ్ మహల్‌దాటి ప్రక్కనే ఉన్న రఘునాధదాదా భవనంవైపు పరుగెత్తసాగాడు నారాయణరావు.

పీష్వా పరుగు చూసి గార్దీలు, "పట్టుకోండి-పోనీయకండి!" అంటూ వెంబడించారు.

తడారిన నోటితో, చెమటలుగక్కే శరీరంతో, దిక్కు తోచని వేగంతో పినతండ్రి భవనంలోనికి జొరబడ్డాడు పీష్వా.

"దాదా! దాదా! నన్ను రక్షించు దాదా!" అంటూ వెళ్ళి పూజా మందిరంలో జపం చేస్తున్న రఘునాథదాదా కాళ్ళు పట్టుకున్నాడు.

"బాబూ! నారాయణ్!" అంటూ అతన్ని లేవదీయబోయాడు దాదా. కాని నారాయణరావు పినతండ్రి పాదాలు వొదల్లేదు.

"దాదాజీ! నేను మీ అన్న కుమారుణ్ణి. మీరు నాకు తండ్రి లాంటివారు. నా అపరాధాలు మన్నించండి! మా అన్నకూ, వదినెకూ ఇచ్చిన మాట నిలబెట్టుకోండి! నా ప్రాణాలు రక్షించండి! గార్డీలు నన్ను చంపడానికొస్తున్నారు."

ఏమనటానికీ తోచక రఘునాథరావు అలాగే కూచుండిపోయాడు.

ఓ ప్రక్కన నిలుచున్న ఆనందీబాయి భీతచిత్తుడైన పీష్వాను తీక్షణంగా చూడసాగింది.

ఇంతలో తులాజీపవార్, సుమేర్‌సింగ్, మహమ్మద్ యూసఫ్, ఖరక్‌సింగ్, బహదూర్‌ఖాన్‌లు లోనికి చొచ్చుకు వచ్చారు. వారందరి చేతుల్లోనూ ఉన్న కత్తుల్నీ, వారి ముఖాల్లోని భీకరత్వాన్నీ చూసి గజగజ వొణికిపోయాడు నారాయణరావు.

"దాదాజీ! నన్ను రక్షించండి! కావాలంటే పీష్వా పదవిని మీరే అలంకరించండి" అంటూ పినతండ్రి నడుము చుట్టూ చేతులు వేసి, ఒళ్ళో తలదాచుకున్నాడు

ఆ దృశ్యం చూసి నివ్వెరపోయి నిలుచున్నారు గార్డీలు.

"ఊఁ....కానివ్వండి!" అంటూ గుడ్లురిమింది ఆనందీబాయి.

వెంటనే తులాజీ ముందడుగు వేశాడు.

"వద్దు-వద్దు. ఆగండి. నేను చెప్పిందేమిటి- మీరు చేసేదేమిటి?" అని రఘునాథరావు వారిస్తున్నా లెక్కించకుండా అతడు నారాయణరావు జుట్టు పట్టుకుని లాగాడు. ఖరక్‌సింగ్ కూడా అతనికి తోడైనాడు. ఇద్దరూ బలమంతా ఉపయోగించి "దాదా! దాదా!" అని హృదయవిదారకంగా అరుస్తున్న నారాయణరావును రఘునాథరావు నుండి ప్రక్కకు ఈడ్చారు.

"బాబోయ్! శ్రీమంతుని చంపేస్తున్నారు" అంటూ చపాజీ తిలేకర్ అనే సేవకుడూ, ఇద్దరు అంతఃపుర దాసీలూ పరుగున వచ్చి పీష్వా పైబడి గట్టిగా కావిలించుకున్నారు.

ఖరక్‌పింగ్ పళ్ళు కొరుకుతూ చపాజీ తిలేకర్ మెడ నరికి వేశాడు. దాసీలిద్దర్నీ కత్తులతో క్రుమ్మి జుట్టు పట్టుకుని దూరంగా లాగివేశారు గార్దీలు.

సుమేర్‌పింగ్ తన పట్టాకత్తితో నారాయణరావు వక్షస్థలంపై కుమ్మాడు. "దాదా!" నారాయణరావు కేకతో భవనం మారుమ్రోగింది. వెంటనే నలుగులు గార్దీనాయకులూ పీష్వా సుందర దేహాన్ని ముక్కలు ముక్కలుగా నరికివేసారు. అతని శరీర ఖండాలు పూజా మందిరం అంతటా చెల్లాచెదురుగా పడ్డాయి. అతని రక్తం చిమ్మి రఘునాధరావునూ, అతను పూజించే గణేశ విగ్రహాన్ని తడిపాయి.

"భగవాన్!" అంటూ గట్టిగా కళ్ళు మూసుకున్నాడు దాదా. అతని శరీరం అంతులేని భీతితో వణికిపోసాగింది. గార్దీలను నిందించటానికి కూడా అతనికి నోరు రాలేదు

ఇంతలో నరోబానాయక్ అనే ముసలి ఉద్యోగి లోపలికి దూసుకొచ్చాడు. ఖండ ఖండాలుగా నరికివేయబడిన పీష్వా శరీరాన్ని చూడగానే గుండె బాదుకుంటూ జుట్టు పీక్కుంటూ ఏడపసాగాడు.

"ఘోరం! ఘోరం! ఎంత దారుణం చేయించారు దాదా సాహెబ్! పుత్రుణ్ణి అధికార దాహంతో ఇంత భయంకరంగా చంపిస్తారా? బ్రాహ్మలైన మీకింతటి క్రూరకర్మ తగునా? అందునా పూజా గృహంలో ఒక బ్రాహ్మణ ప్రభువును చంపించిన మీకు పుట్టగతు లుంటాయా? గంగాబాయమ్మ ఉసురు తగిలి మీరూ, మీ సంతానమూ సర్వనాశనమైపోరూ?" అంటూ విలపిస్తూనే నిందించటం మొదలెట్టాడు.

"చూస్తారేం? కోసెయ్యండి గాడిద కొడుకును!" తులాజీ అరిచాడు. అంతే! క్షణంలో సరిగ్గా సగానికి తెగిపోయాడు నరోబా నాయక్.

అలా ఒక్క అరగంటలో పీష్వాతో సహా ఏడుగురు బ్రాహ్మ

ఋల్నీ, ఇద్దరు సేవకుల్నీ, ఇద్దరు దాసీలనూ, ఒక గోవును ముక్కలు ముక్కలుగా నరికివేశారు గార్దీలు.

# 9

శనివార్‌వాడా వెలుపల గోలగోలగా ఉంది.

హరిపంత్ ఫడ్కే పరుగు పరుగున వచ్చాడు.

హవేలీ ముఖద్వారం మూయబడి వుంది. లోపల వందలకొద్దీ గార్దీలు ఆయుధపాణులై పోరాటానికి సిద్ధంగా నిలిచివున్నారు. హవేలీ చుట్టూ తన సిపాయీలను నిలబెట్టి భవనానికెదురుగా ఫిరంగులు మోహరించాడు హరిపంత్ కాని వాడాలోపల ఏం జరుగుతున్నదీ స్పష్టంగా తెలియకపోవడంతో నిస్సహాయంగా ఉండిపోయాడు.

"పీష్వానూ, దాదానూ గార్దీలు చంపేశారు" అన్న వదంతి కార్చిచ్చులా నగరమంతా క్షణంలో వ్యాపించింది. వీధి వీధినా అల గోడు, బాలగోడు వినిపించసాగింది. వర్తకులు దుకాణాలు మూసి భీతచిత్తులై ఇళ్ళలో ఒదిగారు. ఆయుధోపజీవులయిన వారు మాత్రం కత్తులు కటార్లు చేతబట్టి వీధుల్లో తిరుగాడసాగారు.

మంత్రులు, ఉన్నతోద్యోగులు, సరదార్లు-ఎవరూ హవేరీలోనికి పోవటానికి సాహసించలేకపోయారు. ఒక్కొక్కరే క్రమంగా బుధవారపేట కొత్వాలు చావిడి కడకు చేరటం ప్రారంభించారు.

సఖారామ్ బాపూ, నానాఫర్నవీసు, భవనరావు ప్రతినిధి, మాలోజీ ఘోర్పడే, త్రియంబకరావు మామా ఇంకా ఎందరెందరో ఆ ఠాణాలోనికి ప్రవేశించారు.

"అసలేం జరిగింది?" ఇదే ప్రశ్న ప్రతి వారినోట వెలువడుతుంది.

"శ్రీమంత్ పంత్ ప్రధాన్‌ను పొట్టన బెట్టుకుని వుంటారు" అన్నాడు నానాఫర్నవీసు. అతని కళ్ళనుండి ధారావాహిగా బాష్ప బిందువులు దొర్లుతున్నాయి.

"దాదాసాహబ్‌ను కూడా చంపేసి వుంటారు" అన్నాడు సఖా

రామ్. ఆ వృద్ధమంత్రి స్వరం గద్గదమైపోయింది.

కాని వాడా లోపల ఏం జరిగిందో ఇదమిత్థమని ఎవరికీ తెలియదు.

పీష్వాలకు వియ్యంకులైన పేథేలు, రాస్తియాలు బిక్క మొగాలతో బాపూవైపు చూస్తున్నారు.

"లోపల ఏం జరిగిందో, ఏం జరుగుతుందో తెలుసుకోడం తక్షణ కర్తవ్యం" అన్నాడు త్రియంబకరావు మామా.

"మనలో కొందరం వెళ్ళివద్దాం" అన్నాడు సఖారామ్.

భవనరావు, మాలోజీ ఇద్దరూ లేచారు. వారితోబాటు వృద్ధులయిన నగర ప్రముఖులు కూడా బయలుదేరారు.

హవేలీ ముఖద్వారంవద్ద గార్డ్లు వారిని అడ్డుకున్నారు.

"ఇప్పుడెవరూ లోనికి వెళ్ళడానికి వీలుకాదు" అన్నాడు బహదూర్‌ఖాన్.

"దాదాసాహబ్‌ను చూడాలి!" మాలోజీ గర్జించాడు.

"వారు క్షేమంగానే ఉన్నారు."

"మా కళ్ళారా చూసి మంత్రులతో చెప్పవలసి వుంది."

బహదూర్‌ఖాన్ ఓ క్షణం తటపటాయించి, "సరే- మీ ఆయుధాలు బయట పడేసి రండి" అన్నాడు.

నిరాయుధులు కావడానికి అందరూ కాస్సేపు సందేహించారు.

"కానివ్వండి. ఇంత జరిగాక ఇంకా వెనుకంజతో పనేమిటి?" అంటూ భవనరావు తన ఖడ్గం తీసి గార్డ్ల కిచ్చాడు. తక్కినవారు అతన్ని అనుసరించారు.

వారు లోపలికి అడుగు పెట్టే సమయానికి చీకటి పడుతోంది. నిర్ధూమధామమైన హవేలీలో అక్కడక్కడ గార్డ్ల చేతుల్లో దివిటీలు వెలుగుతున్నాయి. శోకదేవత స్పృహ తప్పిందా అన్నట్లు ఎక్కడా దుఃఖారావాలు వినిపించటం లేదు. కాని శనివార్‌వాడాలోని భవనాలన్నింటిలోను గార్డ్లు జొరబడి పాత్రలు బయటికి గిరవాటు వేస్తున్న చప్పుళ్ళు మాత్రం వినబడుతున్నాయి. ఓ వెండి పాత్ర విసురున వచ్చి మాలోజీ ఘోర్పడే కాళ్ళ సమీపంలో పడింది. అతడు పిడికిలి బిగించటం చూసి భవనరావు అతన్ని కళ్ళతోనే వారించాడు.

దేవిడీ ముందు దివిటీల కాంతిలో ఆసీనుడై ఉన్న రఘునాథ దాదా వారి కళ్ళ బడ్డాడు. అతని చుట్టూ ఇరవై మంది గార్దీలు కత్తులు దూసి నిలబడి వున్నారు. దివిటీల వెలుగులు వారి కరవాలాలపై ప్రతిఫలిస్తున్నాయి.

మాలోజీ, అతని అనుచరులు వచ్చి రఘునాధరావు ముందు నిలిచారు.

రఘునాధరావు కళ్ళెత్తి వారందరి వైపూ దీనంగా చూశాడు.

"ఏమిటిదంతా, దాదాసాహబ్?" అన్నాడు భవనరావు.

రఘునాధరావు తలవంచాడు. ఏమి చెప్పటానికీ అతనికి నోరెగసలేదు.

"దేన్ని గురించి మీరడిగేది?" రూక్షంగా ప్రశ్నించాడు ఖరక్ సింగ్.

"శ్రీమంతుల వారి...."

"వధను గూర్చి. అవునా?"

"అవును."

"గార్దీలకు ఆరు నెలల జీతాలు అందలేదు."

"అందకపోతే పీష్వాను హత్య చేస్తారా?"

"పీష్వానే కాదు. అవసరమైతే వారి వంశీకులందర్నీ వధిస్తాం" అంటూ రఘునాధరావు వైపు తీక్షణంగా చూశాడు సుమేర్ సింగ్.

ఇంతకు కారణమైన తులాజీ పవార్ ఓ మూల ఒదిగి మాలోజీ వైపు దొంగచూపులు చూడసాగాడు.

భవనరావు రఘునాధరావు వైపు ఉరిమి చూశాడు.

"దాదాసాహబ్! ఏమీ తెలియని అమాయకుల వలె నటించి ప్రయోజనం లేదు. మీకు తెలియకుండా హవేలీలో ఇంత ఘోరం జరుగుతుందంటే ఎవ్వరూ నమ్మరు."

"ఓరి పాపీ! బాజీరావు పుత్రుడవై ఉండి శనివార్‌వాడాలో ఇంత దారుణం జరిపిస్తావా? నీ అన్న కుమారుణ్ణి పొట్టన బెట్టుకుంటావా!" మాలోజీ గర్జించాడు.

"క్యా బక్ తేహో?" అంటూ ముందడుగు వేశాడు యూసఫ్

"ఠహరో!" అంటూ యూసఫ్‌ను ఆపి మాలోజీ వైపు తిరిగాడు సుమేర్‌సింగ్. "దారుణం కానివ్వండి, మరేమైనా కానివ్వండి. మా బకాయీలు చెల్లించకుంటే ఎవరి పరువూ దక్కదు."

నగర ప్రముఖులు గార్డ్ల జీతపు బకాయీలకు పూచీ పడ్డారు.

ఇంతలో త్రియంబకరావు మామా హవేలీలోనికి వచ్చాడు. అరవై ఏళ్ళు దాటిన ఆ వృద్ధవీరుడు తన ఖడ్గాన్ని గార్డులకు ఒప్పగించకుండానే ప్రవేశించాడు. అతన్ని నిలవేసి నిరాయుధుణ్ణి చేయగల దమ్ములు గార్డులలో ఎవరికీ లేకపోయాయి.

రఘునాధరావు అతని కంట బడగానే రెండు చేతుల్తోనూ కళ్ళు కప్పుకుని మరో ప్రక్కకి తిరిగాడు.

"శివ- శివ: పుత్రఘాతకుడి ముఖం చూస్తే మహా పాతకం చుట్టుకుంటుంది. మాలోజీ! పీష్వా శరీరం ఎక్కడుంది?"

ఎవరూ ఏమీ జవాబు చెప్పలేదు.

మామా సరాసరి రఘునాధదాదా మందిరంలోనికి దారి తీశాడు. మాలోజీ, భవనరావు, తక్కిన ప్రముఖులూ అతని వెంట నడిచారు. త్రియంబకరావును ఎవరూ అడ్డగించలేదు సరిగదా, అతడు హుటాహుటి నడిచి వస్తూంటే భవనం అంతటా క్రమ్మివున్న గార్డులు అడ్డు తప్పుకుని దారి ఇచ్చారు. హైదరాలీ వంటి వీరాధివీరుణ్ణి ముప్పు తిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించిన వృద్ధ మహారాష్ట్ర సింహాన్ని ఎదుర్కొనటమే!

అన్ని కక్ష్యలూ గడిచి పూజామందిరంలోనికి రాగానే అందరూ స్థంభించిపోయారు. ఐదుగురు వ్యక్తుల శరీర ఖండాలతోనూ, రక్తపు మడుగులతోనూ పూజాగృహం అంతా భీభత్సంగా ఉంది.

మాలోజీ ఇద్దరు సేవకుల సాయంతో పీష్వానారాయణరావు శరీరఖండాలను ఓచోట చేర్చి రూపకల్పన చేశాడు.

అప్పటివరకూ సముద్ర గంభీర ముద్రతో నిలిచివున్న త్రియంబకరావు మామా, కుమార పీష్వా ఖండిత కళేబరం చూసి నిభాయించుకోలేకపోయాడు.

"బాబూ! నారాయణ్!" అంటూ శవఖండాలపై వ్రాలి వల

వలా ఏడవసాగాడు. "తాతా అంటూ ప్రేమతో పిలిచే నీ నోరు మూగ బోయిందా బాబూ? చిన్నతనాన నా భుజాలపై ఎక్కి ఆడిన శరీరం ముక్కలయిందా? గంగాబాయమ్మ పాణిగ్రహం చేసిన చేయి, కర్ణాటకం సంచరించిన కాళ్ళు ఖండించబడ్డాయా?" అంటూ శోకావేశంతో విలపించాడు.

"మామా సాహబ్! తమరే ఇలా అయితే మమ్మల్నందర్నీ ఓదార్చేవారెవరు? రండి- శవానికి అంత్య సంస్కారం చేయవలసి వుంది" అంటూ శవఖండాలను మూటగట్టాడు మాలోజీ.

అందరూ బరువెక్కిన గుండెలతో నారాయణరావు శవాన్ని మోసుకుంటూ హవేలీ దాటి వెళ్ళిపోయారు.

అప్పటికి అర్ధరాత్రి దాటింది కాని పుణే ప్రజలెవ్వరూ నిద్ర పోలేదు. మంత్రులు, బంధువులు, అధికారులు వెంటరాగా శవాన్ని ఊరేగింపుగా శ్మశానానికి తరలించారు. దారిపొడవునా పురప్రజలు చేసిన విలాపధ్వనులు హవేలీలో గార్డుల రక్షణలో తలొంచుకుని కూచున్న రఘునాధరావుకీ, ఆనందంతో తలమునకలవుతూ గదిలో పరువుపై పొర్లుతున్న ఆనందీబాయికీ, కన్నీరు మున్నీరుగా విలపించే పార్వతీబాయికీ వినబడుతూనే ఉన్నాయి. గంగాబాయి మాటి మాటికీ మూర్ఛిల్లుతూనే ఉంది.

వీధులలో శవయాత్ర సాగుతుండగా ప్రజలంతా ఎడతెగని కన్నీటితో వీడ్కోలిచ్చారు. స్త్రీలు గుండె బాదుకుంటూ, నెత్తి మోదుకుంటూ, కడపటి పుత్రుని కూడా కోల్పోయిన గోపికాబాయి దయనీయస్థితిని గూర్చి, గంగాబాయి నారాయణరావుల అన్యోన్య దాంపత్యాన్ని గూర్చి ఒకరితో ఒకరు చెప్పుకుంటూ బిగ్గరగా ఏడవసాగారు. అప్పుడప్పుడు రఘునాధరావునూ, ఆనందీబాయినీ భయంకరంగా శపిస్తూ శనివార్‌వాడా వేపు దుమ్మెత్తిపోశారు.

# 10

రాత్రి రెండు గంటలు దాటినా పుణేలోని ఆంగ్ల ప్రతినిధి నివాస భవనం సందడిగానే వుంది. శవయాత్ర తాలూకు శబ్దాలు వింటూ నిలువుటద్దంలో చూస్తూ విగ్గు సవరించుకుంటున్నాడు మోష్టిన్. దీపాల

కాంతిలో అతని ముఖం ఉజ్జ్వలంగా వెలిగిపోతుంది. సంతోషం పట్టలేక అతడు అప్పుడప్పుడు సన్నగా ఈల వేస్తున్నాడు:

'ఎన్నాళ్ళకెన్నాళ్ళకు?

ఇలాంటి తరుణంకోసమే ఇన్నాళ్ళూ వేచివున్నాడు. ఇలాంటి అవకాశం కోసమే బొంబాయి కంపెనీవారు ఎదురుచూస్తున్నారు.

మద్రాసు కంపెనీవారు-ఉత్తర సర్కార్లు సంపాదించి, కర్ణాటక నవాబునీ, హైదరాబాద్ నిజామునీ గుప్పెట్లోకి తెచ్చుకున్నారు.

బెంగాల్ కంపెనీవారు-బెంగాల్, బీహార్ సాధించి, అయోధ్య నవాబును పెంపుడు కుక్కని చేశారు.

మరి బొంబాయి కంపెనీవారు?

బొంబాయి రేవు మినహాయించి ఏమీలేదు.

ఏదీ? కొంకణతీరంలో జోక్యానికి అవకాశం కలిగితేనా? బాలాజీరావు బ్రతికివున్నంతవరకూ అసలా ఊహకే ఆస్కారం లేకపోయింది. ఇక మాధవరావు కాలంలో కదిపి చూశారు. కాని లాభం లేకపోయింది. హైదరాలీకి వ్యతిరేకంగా సహాయపడగలమని ముందుకొస్తే 'సర్వనాశనమైనా సరే, విదేశీయుల జోక్యం సహించ'నని ఎంత నిర్మొహమాటంగా చెప్పాడు.

అవమానం! దుర్భరమయిన అవమానం!

పీష్వాల హయాములో బొంబాయివారు అసలు తీరాన అడుగు మోపగలరా అన్న సందేహం కూడా కలిగింది.

ఇన్నాళ్ళకు హఠాత్తుగా....

ఈ సదవకాశం జారవిడవరాదు!'

ముస్తాబు పూర్తిచేసుకుని ఇద్దరు అనుచరులు వెంటరాగా అశ్వారూఢుడై శనివార్‌వాడా దిక్కుగా సాగాడు మోష్టిన్.

గార్డీలు మోష్టిన్‌ను అటకాయించలేదు.

"సర్కార్! అంగ్రేజీవారి ప్రతినిధి మోష్టిన్ వస్తున్నాడు" అన్నాడు తులాజీ.

రఘునాధరావు ఇప్పుడు తన భవిష్యత్తును గురించి తీవ్రంగా ఆలోచన చేస్తున్నాడు. అన్న కొడుకు కళేబరం దేవిడీ విడిచిపోయాక

అతనిలో కొట్టుమిట్టాడుతున్న విషాదచ్ఛాయలు తొలగిపోయి స్వార్థం, సంతోషం తలెత్తాయి.

"నమస్తే దాదాసాహబ్" అన్నాడు మోష్టిన్ వినయంగా వంగి.

"రండి- కూర్చోండి" అన్నాడు రఘునాధరవు.

"తమ కుటుంబానికి వచ్చిన ఘోరమైన విపత్తును గురించి తెలుసుకుని చాలా విచారించాను. ఈ దుఃఖసమయంలో ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ వారి తరఫున నా సానుభూతిని తెలియ జేస్తున్నాను."

గార్దీనాయకులంతా మోష్టిన్‌వేపు కోపంతో మిర్రి మిర్రి చూశారు. అలా పలకటం సంప్రదాయం అన్న సంగతి రఘునాధ రావుకు తెలుసు. అయినా అతదేమీ ప్రత్యుత్తరం ఇవ్వలేదు.

"దాదాసాహబ్! మహారాష్ట్ర సామ్రాజ్యానికి కాబోయే పీష్వాగా తమరిని అభినందిస్తున్నాను. అంతేకాదు- ఈ తరుణంలో తమరు అనేక ఇబ్బందులు ఎదుర్కొనవలసిరావచ్చు. అట్టి సందర్భాలలో తమకు అండదండలుగా నిలవటానికి బొంబాయిలో కంపెనీ గవ ర్నరూ, అధికారులూ కాచుకొని ఉన్నారని దయచేసి మరిచిపోకండి."

రఘునాధరావు దాదా మోష్టిన్‌వేపు వింతగా చూశాడు.

సానుభూతి! అభినందన! అభయప్రధానం!

ఏమి యుక్తి తెల్లవాడిది!

అయినా ఏమీ మాట్లాడక నిశ్శబ్దం పాటించాడు రఘునాధరావు.

"వస్తాము. సెలవిప్పించండి శ్రీమంత్ పంత్ ప్రధాన్!" అంటూ లేచి నించున్నాడు మోష్టిన్.

ఆ సంబోధన విని రఘునాధరావు శరీరం గగుర్పొడిచింది.

ఆనందం పుక్కిలింతలై తనూ లేచి నిలుచున్నాడు.

అతనిలోని మార్పు గమనించాడు మోష్టిన్. నవ్వుతూ కరచా లనం చేసి తన నివాస గృహానికి బయలుదేరాడు.

నగరం వెలుపల పీష్వా నారాయణరావు అంత్యక్రియలు జరిపి ఎవరిళ్ళకు వారు చేరుకున్నారు.

నగరం అంతా సద్దు మణిగింది. కాని ఆ నిశ్శబ్ద నిశీధిలో నిద్రాదేవి పుణేనగర ప్రజల్ని ఎవరినీ కరుణించలేదు. అందరి

హృదయాల్లో ఏదో తెలియని ఆందోళన, అంతులేని భయం, అపార మైన దుఃఖం ఆవరించి వున్నాయి.

అందరి మనో నేత్రాలముందు పద్దెనిమిదేళ్ళ కుమార పీష్వా నారాయణరావు సుందర ముఖారవిందమే మాటిమాటికీ మెదల సాగింది.

# 11

పీష్వా నారాయణరావు వధ జరిగిన పదో రోజు ఉదయాన్నే హరి పంత్ యింటి కొచ్చాడు మాలోజీ.

అప్పుడే హరిపంత్ వస్త్రధారణ పూర్తి చేసి తలపాగ చుట్టు కుంటున్నాడు.

"వస్తున్నారా?" అన్నాడు మాలోజీ.

"రాకపోవడం కూడానా?" కన్నీళ్ళు పెట్టుకున్నాడు హరిపంత్. "పాపాత్ముణ్ణి-ఆ నాడు మధ్యాహ్నం భోజనానికి వెళ్ళకుండా శ్రీమంతుల వారితో బాటే కోటకి వెళ్ళి గార్దీలకు దేవిడీ మన్నా చెప్పి వుంటే ఎంత బాగుండేది? నా నిర్లక్ష్యం వల్లనే ఇంత జరిగిపోయింది మాలోజీ!"

"గడిచిందానికి విచారించి ప్రయోజనం లేదు. విధి వ్రాత ఎలా వుంటే అలా జరిగిపోతుంది."

"మన కళ్ళ ముందు పుట్టిన శ్రీమంతులవారికి అప్పుడే దిన వారాలుకూడా జరిగిపోతున్నాయి. తలచుకుంటే ఎలాగో వుంది."

"ఈ రోజు పెదకర్మకు అందరూ వస్తారంటారా?"

"వస్తారనే అనుకుంటున్నాను.... ఈ పది రోజులూ బయటికి రావడానికే మనస్కరించలేదు. ఏమిటి విశేషాలు మాలోజీ?"

"ఏముంది? మహా ఘనత వహించిన పుత్ర ఘాతకులు రఘునాధపంత్ ప్రధానులవారు పరిపాలన మొదలెట్టారు."

"మంత్రులెవరు?"

"ఉన్నాడుగా సఖారామ్ బాపూ! అతడే మళ్ళీ కార్భారి!"

"ఇంతటి ద్రోహి క్రింద పని చెయ్యటానికి వారు ఒప్పుకున్నారా?"

"ఒప్పుకోక ఏం చేస్తారు చెప్పండి? శ్రీమంతులవారి వంశంలో ఇహ మిగిలింది దాదా ఒక్కడే గదా! పైగా రామశాస్త్రిగారు కూడా విచారణ ఫలితం తేలిందాకా దాదాయే పీష్వా కావడానికి అంగీకరించారు."

"ఏమిటీ! రామశాస్త్రిగారు విచారణ జరుపుతున్నారా?" ఎగిరి గంతేశాడు హరిపంత్.

"అవును. వధ జరిగిన మర్నాటి నుంచీ విచారణ జరుగుతోంది."

"మంచిది. రామశాస్త్రిగారు న్యాయం తప్పరు. నేరస్థులెవరో నిర్భయంగా ప్రకటించి తగు శిక్ష విధించి తీరతారు....సరే, ఇంతకీ సఖారామ్‌బాపూ అంత తేలిగ్గా పుత్రఘాతకుణ్ణి సేవిస్తున్నారా?"

"లేదు. ఇంతవరకూ దాదా దర్శనానికి పోలేదు. ఈ పది రోజులూ పిచ్చివాడి లాగా ఊరి వెలుపల తిరుగుతున్నారు. మాధవరావుకూ, రమాబాయికీ ఇచ్చిన మాట నిలబెట్టుకోలేక పోయానని తెగ బాధపడి పోతున్నారట!"

"నానా ఫర్నవీసు?"

"రాజకీయాల జోలికి పోకుండా ఇంట్లోనే ముడుచు కూర్చున్నారు. అప్పుడప్పుడు త్రియంబకరావు మామాతో సంప్రదిస్తున్నారని వినికిడి. వీళ్ళందరి మాటకేం గాని, గోపికాబాయమ్మ స్థితి తలిస్తే కడుపు తరుక్కుపోతోంది."

"వారిప్పుడు నాసిక్‌లోనే ఉన్నారా?"

"అవును. పెద్ద కొడుకు విశ్వాసరావు పానిపట్టులో మరణించాడు. రెండో కొడుకు మాధవరావు జబ్బుతో మరణించాడు. మూడో కొడుకు గతి ఇలా అయింది. ఈ వార్త వినగానే ఆమెకు పిచ్చెక్కిపోయిందట! జోలెచేత బట్టి ఇల్లిల్లూ తిరిగి భిక్షాటన చేస్తోందట! పాపం! పుత్రశోకం ఆమె నేగతికి తెచ్చిందో చూశారా?"

"ఇక చెప్పకండి మాలోజీ! వినలేను. ఇంత చేవ చచ్చి ఉన్నామా?"

"ఏం చేస్తాం చెప్పండి? ఆ|నీచుడికే అన్నీ కలిపి వస్తున్నాయి. ఉత్తరాది నుంచి వచ్చిన ఇరవై రెండు లక్షలూ సంగ్రహించాడు. గార్డీలకేదో కొంత ఇచ్చి వాళ్ళ బెడద నుంచి బయటపడ్డాడు. ఛత్రపతి నుండి అధికారదుస్తులు తెప్పించబోతున్నాడు. ఇక కావలసిం దేముంది?"

"హరహరా! భగవంతుడు లేడూ? ఇంత ఘోరం సహిస్తాడా?"

"లేదు- లేదు. అంత ఇదై పోవద్దు. గంగాబాయమ్మగారు గర్భం ధరించి వున్నారని కర్ణాకర్ణిగ ఊరంతా చెప్పుకుంటున్నారు. అదే నిజమయితే ఈ దుర్మార్గుడి రోజులు దగ్గర పడ్డాయన్న మాటే!"

"ఏమో! అంతా ఈశ్వరేచ్ఛ! రండి వెళ్దాం."

హరిపంత్ ఫడ్కే, మాలోజీ ఘోర్పడే ఇద్దరూ కుమార పీష్వా కళేబరాన్ని దహనం చేసిన ప్రదేశం చేరుకున్నారు. అప్పటికే సఖారామ్‌బాపూ, నానా ఫర్నవీసు, త్రియంబకరావు మామా, గోపాల రావు పట్వర్ధన్ మున్నగు హేమీ హేమీలంతా అక్కడ చేరి వున్నారు. అందరి ముఖాలూ గంభీరంగా ఉన్నాయి. కర్మకాండ ముగిసే వరకూ అందరినీ విషణ్ణత ఆవరించే ఉంది.

తరువాత అందర్నీ ఉద్దేశించి నానాఫర్నవీసు ఇలా చెప్పాడు.

"పంత్ ప్రధాన్ మరణించిన తీరు మన అందరినీ కలత పెడుతోంది. వారు దారుణంగా హత్య చేయబడినారన్న సంగతి అందరికీ తెలిసిందే. అంతేకాదు- ఈ వధకు కారకులెవరో కూడా అందరి మనస్సులకూ తెలుసు. ప్రస్తుతం రామశాస్త్రిగారి విచారణలో ఆ వ్యక్తి దోషి అని ఋజువైన పక్షంలో మనమందరం సంఘీ భావంతో వానిని ఎదుర్కొనవలసి వుంది. కీర్తిశేషులైన శ్రీమంతుల వారి పవిత్రమైన ఆత్మసాక్షిగా, నేరస్థుడని ఋజువైన వాని పాలనను వ్యతిరేకించగలమని అందరూ ప్రమాణం చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాను."

సఖారామ్‌బాపూతో సహా అక్కడ ఉన్న వారంతా ఆ విధంగా ప్రమాణాలు చేశారు.

# 12

దారుణం జరిగిపోయి ఆరు వారాలు గడిచాక మళ్ళీ నేటికి శనివార్ వాడా అంతా ఉద్యోగుల సంచలనంతో కళకళల్లాడుతూ వుంది. రెండు రోజుల క్రిందటే రఘునాధ దాదా పంత్ ప్రధాన్‌గా ఛత్రపతి చేత ప్రకటింపబడ్డాడు. ఆనందీబాయి నేటికి పీష్వా భార్య కాగలిగింది.

గణేశ్ మహల్ పక్కనున్న భవనంలో పార్వతీబాయి, గంగా బాయి శోకభారం చేత క్రుంగి కృశిస్తూ భారంగా కాలం గడుపు తున్నారు. వారిప్పుడు దాదాపు ఖైదీలుగా ఉంటున్నారు.

గుప్పు గుప్పున హుక్కా పీలుస్తున్న రఘునాధరావు పీష్వా ఇప్పుడు పుణేలోని పరిస్థితులను గురించి అణుమాత్రమైనా చింతిం చటం లేదు. లోలోపల ఎంత అసంతృప్తితో అలమటిస్తున్నా, బాపూ నానాలతో సహా అందరూ అతని ఆజ్ఞలు శిరసావహిస్తున్నారు. కనుక వాళ్ళతో పేచీలేదు.

అతని ఆలోచనలు అన్నీ ఇప్పుడు నిజామలీపైనా, హైదరాలీ పైనా కేంద్రీకరించి వున్నాయి. హైదరాబాదు పాలకుడైన నిజామలీ ఖాన్ భోన్‌స్లేతో కుట్ర పన్నుతూ మహారాష్ట్రం పై దాడి జరుగు తున్నాడు. హైదరాలీ కృష్ణా తుంగభద్రానదుల నడుమ ప్రదేశంలో విజృంభిస్తున్నాడు. కనుక ముందు నిజామలీని తరిమికొట్టాలి. హైద రాలీని అణచి అతని నుండి కప్పం వసూలు చెయ్యాలి. ఆ తరువాత ఆర్కాటు నవాబును బెదిరించి బొక్కసం నింపాలి. తుది మజిలీగా తంజావూరు చేరాలి.

ఇన్ని ఊహలు రఘునాధుని మస్తిష్కంలో తాండవ మాడు తున్నాయి.

అందుకే కర్ణాటక దండయాత్రకు సంసిద్ధమైనాడు.

రేపే బయలుదేరవలసి వుంది.

"శ్రీమంత్! రామశాస్త్రిగారు తమ దర్శనార్థం వేచివున్నారు."

రఘునాథరావు చేతినుండి హుక్కా నేల వాలి పోయింది.

అతని గుండె గతుక్కుమంది.

అయినా ధైర్యం కూడదీసుకుని-"ప్రవేశ పెట్టు" అన్నాడు.

ఆసనంపై సర్దుకుని కూచుని శాస్త్రి రాకకై ఎదురు చూడ సాగాడు. శాస్త్రి అన్న పదం విని ఆనందీబాయి కూడా పరదాచాటుకు వచ్చి కూచుంది.

రామశాస్త్రి ఠీవిగా ప్రవేశించాడు. అతని ముఖంలో బ్రహ్మ తేజస్సు కొట్టవచ్చినట్లు కనబడుతోంది.

"రండి శాస్త్రీబువా! ఆసీనులు కండి" అంటూ సాదరంగా ఆహ్వానిస్తూ అర్ధాసనం చూపాడు దాదా.

"శ్రీమంతులవారితో అర్థాసనంపై కూచునే అర్హత ఈ పేద వాడికి లేదు."

"ధనిక దరిద్ర బేధం పీష్వాలు పాటించరని తమకు తెలుసు గదా శాస్త్రిగారూ?"

"పాత రీతులన్నీ పీష్వానారాయణరావుతోనే పోయాయి. ఇప్పుడన్నీ క్రొంగ్రొత్త సంప్రదాయాలు పుట్టుకొస్తున్నాయి. పుత్ర హత్యకు ఒడిగట్టే పద్ధతి మీ వంశంలో ఇంతకు పూర్వం లేదు గదా?"

పీష్వా ముఖంలో కత్తివేటుకు నెత్తురు చుక్కలేదు.

"పుట్టి పుణ్యానికి దారుణమైన నేరం నా నెత్తిన రుద్దు తున్నారు శాస్త్రీజీ!"

ఆనందీబాయి కల్పించుకుంది.

"శాస్త్రీజీ! గోహత్య చేసిన గార్దీలే ఆ దుష్కార్యం చేశారని తెలిసి తెలిసీ మీరిలా నిందారోపణ చేస్తున్నారు."

"బాయీజీ! ప్రధాన న్యాయమూర్తిగా నా ధర్మం నేను నిర్వ హిస్తున్నాను. విచారణ ముగిసింది. సాక్ష్యాధారాలను బట్టి దాదా సాహెబ్ నారాయణరావును హత్య చేయించారని నిర్ధారణ అయింది."

"ఏమిటి ఆ సాక్ష్యాధారాలు?"

"నారాయణరావును చంపవలసినది (మారావే) అని దాదాజీ వ్రాసిన పత్రమే దానికి సాక్ష్యం."

"ఆ పత్రంలో నారాయణరావును పట్టుకోవలసినది (ధరావే) అని ఉండటం నా కళ్ళారా చూశాను. బహుశా గార్దీలో, తులాజీయో 'ధ'ను 'మా'గా దిద్ది వుంటారు."

"తమరు చెప్పినట్లు 'ధరావే' అని వ్రాయటమే నిజమైతే దాదాజీ, మీరూ ప్రత్యక్షంగా ఉండగానే అంతటి ఘోరహత్య చెయ్యడానికి గార్దీలు ఎలా సాహసించగలరు?"

ఈ వివాదం వింటూ కూచున్న రఘునాధరావు విషణ్ణంగా నిట్టూర్పు విడిచాడు.

"ఆ విషయమై ఇప్పుడు వాద ప్రతివాదాలు చేసి లాభంలేదు. సత్యం భగవంతుడికి తెలుసు. ఏది ఏమైనా నారాయణరావు వధను గూర్చి నేను హృదయ పూర్వకంగా దుఃఖిస్తున్నాను. అందులో నా పాత్ర ఏ కొద్దిగానైనా ఉందని తమరు అనుమానించిన పక్షంలో ఎలాంటి ప్రాయశ్చిత్తమైనా చేసుకొనటానికి సిద్ధంగా వున్నాను. పండరీపురంలో తమ సమక్షంలో ప్రాయశ్చిత్తం చేసుకో గలను. జరిగినవన్నీ మరిచిపోయి ప్రాయశ్చిత్తమేమిటో సెలవివ్వండి."

"దాదాసాహెబ్! పండరీపురం వచ్చి మిమ్మల్ని శుద్ధులను చెయ్యటం అసాధ్యం."

"తమరు న్యాయాధీశులు. ప్రాయశ్చిత్తం చేయించటం తమ ధర్మం. తమరు పండరీపురం రావాలి. మాకు ప్రాయశ్చిత్తం జరిపించి పవిత్రులను చేయించాలి."

"తమరి హుంకుమ్ నా కళ్ళతో చూడక ముందయితే అలాగే జరిపించే వాణ్ణి. కాని ఇప్పుడెలా?"

"ఇప్పుడేమిటి ఆటంకం?"

"అంతకు ముందు హత్యా విషయంలో కేవలం అనుమానం ఉండేది. ఇప్పుడది ఋజువైంది కదా! దాదాసాహెబ్! గద్దెనెక్కటానికి పుత్రహత్యా కొడిగట్టి ఘోరమైన పాపం ఆచరించారు. ఆ పాపానికి దేహాంత ప్రాయశ్చిత్తం తప్ప మరో మార్గం లేదు."

రఘునాధరావు ఉలిక్కి పడ్డాడు.

"ఏమిటీ! దేహాంత ప్రాయశ్చిత్తమా?"

"అవును-దేహాంత ప్రాయశ్చిత్తమే!" దృఢంగా పలిగాడు రామశాస్త్రి.

పీష్వా రఘునాధరావుకు నవనాడులూ క్రుంగినట్లయింది. ఆనందీబాయి పరదా వెలువడి వారి సముఖానికి వచ్చింది. భయక్రోధాలతో ఆమె శరీరం కంపిస్తోంది.

"దేహాంత ప్రాయశ్చిత్తమా? శాస్త్రిగారూ! బహూశా తమరు నోరు జారి అని వుంటారు. బాగా ఆలోచించుకొని పలకండి."

"లేదు బాయీసాహెబ్! దేహాంత ప్రాయశ్చిత్తం తప్ప మరో మార్గమే లేదు."

ప్రధాన న్యాయాధీశుని కర్కశ కంఠం విని దాదా చలించి పోయాడు.

"శాస్త్రీజీ! మరో మార్గమే లేదంటారా?"

"లేదు."

"తప్పక ఉండి ఉంటుంది. ఆలోచించి చెప్పండి" అంది ఆనందీబాయి.

"ముమ్మాటికీ చెబుతున్నాను. లేదు-లేదు-లేదు. మీ వంటి పరమ పాతకులను తప్పించే ఉపాయాలేవీ శాస్త్రకారులైన మహర్షులు వ్రాయలేదు."

అంత కటువైన మాటలు ప్రయోగించినా రఘునాధరావుకు రామశాస్త్రిపై క్రోధం కలగలేదు. కాని ఆనందీబాయి క్రోధమూర్తి అయింది.

"మహర్షులు వ్రాయకపోవచ్చు. కాని తమరు వేరే మార్గం వెతక్క తప్పదు. బాగా ఆలోచించుకుని జవాబు చెప్పండి."

రామశాస్త్రి పెదవులపై భయంకరమైన చిరునవ్వు మెరిసింది.

"దేహాంతప్రాయశ్చిత్తం తప్పదమ్మా!"

"ఎక్కడ ఉండి ఏం మాట్లాడుతున్నారన్న సంగతి బొత్తిగా మరిచి పోయినట్లున్నారు. శ్రీమంతులవారికి దేహాంత ప్రాయశ్చిత్తం

విధించే నాలుక వేయి చీలికలవుతుంది. మీరు మా ఉద్యోగులన్న మాట గుర్తుంచుకొని మరీ మాట్లాడండి!"

రామశాస్త్రి ముఖం కందగడ్డయింది. క్రోధావేశంతో కొద్ది క్షణాలు మాట్లాడలేక పోయాడు. కాస్సేపటికి తన్ను తాను నిగ్రహించుకుని నిదానంగానూ, స్ఫుటంగానూ జవాబిచ్చాడు.

"ఈ శనివార్ వాడా లోనికి ప్రవేశించక పూర్వం నేను తమ ఉద్యోగినన్న మాట నిజమే! కాని ఈ ఉద్యోగం నేటితో వదిలి వేస్తున్నానని చెప్పడానికే ఇప్పుడు నే నిక్కడికి వచ్చాను. బాయీ సాహెబ్! ఈ నాలుక ఇంతకు ముందు ఎల్లప్పుడూ సత్యమే పలికింది. ఇప్పుడూ సత్యమే పలుకుతుంది. భవిష్యత్తులో అసత్యం పలక్కుండా తమరు శ్రమతీసుకుని ఈ నాలుకను చీలికలు చేస్తే కృతజ్ఞుణ్ణి సుమీ! రఘునాధరావు దాదా! అధికారత్యాగం చేసిన రామశాస్త్రి తమకు దేహాంత ప్రాయశ్చిత్తం విధిస్తున్నాడు. సర్వాధికారులైన తమకు నిర్బంధ శిక్ష విధించగల శక్తి నాకు లేకపోవచ్చు. అయినప్పటికీ నాతోపాటు వస్తే గంగా తీరంలో తపశ్చర్యలతో ఎలా దేహాంతంసాధించివచ్చో నేర్పగలను.పుత్రఘాతకుడైన పీష్వా పాలనలో వున్న ఈ పుణేలో ఇకపై ఒక్కరోజు కూడా నేను ఉండరాదని నిశ్చయించుకున్నాను. ఇంటిల్లిపాదినీ ఊరునుంచి తరలించి నేనూ నిష్క్రమిస్తున్నాను. తమకిష్టమైతే గంగాతీరంలో...."

ఆనందీబాయి యిక ఓర్చుకోలేక పోయింది.

"గంగాతీరాన తపశ్చర్య విషయం తమరు మరిచిపోండి శాస్త్రీజీ! అంతటి తీరిక శ్రీమంతులకు లేదు. అసలు మీరెవరు మాకు ప్రాయశ్చిత్తం విధించడానికి? తమకు గర్వం బాగా తలకెక్కింది. అహంకారంతో తమ కళ్ళు మూసుకుపోయాయి. కనుక తమకే తపశ్చర్య ఇప్పుడవసరం. చీకటి కొట్టులో తమకు కపాల మోక్షం కలిగితేగాని తిక్క కుదరదు. ఎవరక్కడ?"

తులాజీపవార్, గార్దీనాయకులు నలుగురితోనూ ప్రవేశించాడు.

"శాస్త్రిగారూ! మళ్ళీ ఓ మారు బాగా ఆలోచించుకోండి. ఏ మారుమూల కోటలోనో చీకటి కొట్టులో తడుంకుంటూ జీవితాంతం పడి వుంటారో లేక నారాయణరావు వధలో రఘునాధరావుగారి

కెలాంటి సంబంధమూ లేదని నిండు కొలువులో చెబుతారో నిర్ణ యించుకోండి."

"శ్రీమంతులవారిని గూర్చి ఒక్క బాపనయ్య చెప్పకపోతే నష్టం ఏమిటి బాయీజీ?" అన్నాడు తులాజీపవార్.

"హుకుమ్ ఇవ్వండి, వీడి నాలిక చీల్చిపారేస్తాం" అంటూ సుమేర్‌సింగ్. ఖరక్‌సింగ్ శాస్త్రికిరువైపులా చురకత్తులు చేతబట్టి నిలుచున్నారు.

"శాస్త్రిగారూ! తమరిప్పుడు ఖైదీలు. ఇహ చెప్పండి. ఏం చెయ్యబోతున్నారో?" అంది ఆనందీబాయి.

రామశాస్త్రి అణుమాత్రమైనా తొణకలేదు, బెణకలేదు.

"తమ చిత్తం వచ్చినట్లు చేయవచ్చు. కావాలంటే నాలుకను చీల్చండి లేదా చీకటి కొట్టులో బంధించండి. ఇంకా కావాలంటే పీష్వా నారాయణరావును ముక్కలు ముక్కలు చేసిన ఖడ్గాలతోనే నన్ను కూడా ఖండ ఖండాలుగా నరికి వెయ్యండి. ఏం చేసినా సరే, కాని పీష్వా నారాయణరావు వధ రఘునాథ దాదాయే చేయించాడనీ, దీనికి దేహాంత ప్రాయశ్చిత్తం తప్పదనీ నా కొన వూపిరి వున్నంత వరకూ లోకానికి చాటుతూనే ఉంటాను."

ఒళ్ళు తెలియని క్రోధంతో ఒణికిపోతూ పిచ్చిదానివలె అరి చింది ఆనందీబాయి- "ఇంకా చూస్తారేం? బంధించండి. చీకటి గుయ్యారంలోనే వీరికి దేహాంత ప్రాయశ్చిత్తం జరగవలసి వుంది... ఊఁ- బంధించండి."

సుమేర్‌సింగ్, మహమ్మద్ యూసఫ్‌లు ముందడుగువేసి రామశాస్త్రిని బంధించబోయారు.

"ఆగండి!" బిగ్గరగా అరిచాడు రఘునాథదాదా. "నా శిరస్సుపై ఇప్పటికున్న పాపభారం చాలు. ఇంకో పాతకానికి ఒడిగట్టలేను. శాస్త్రీజీ! తమరిక ఒక్క క్షణమైనా పుణే నగరంలో ఉండరాదు. వెంటనే వెళ్ళిపొండి. సుమేర్‌సింగ్! శాస్త్రిగార్ని వెంటనే పుణే సరి హద్దులు దాటించు."

రామశాస్త్రి మళ్ళీ ఏదో మాట్లాడబోయేలోగా గార్డులు అతని నోరు నొక్కి బయటికి తీసుకొనిపోయారు.

ఆనందీబాయి విజయగర్వంతో ఊగిసలాడిపోయింది. కాని నిరాశతో, నిస్పృహతో దాదాసాహబ్ కుప్పకూలిపోయాడు.

# 13

"వీరెవరూ ఇంగ్లీషువారి దౌర్జన్యాలను గూర్చి ఆందోళన పడవద్దు. సందట్లో సమారాధన అన్నట్లు మహారాష్ట్ర సామ్రాజ్యానికి వచ్చిన విపత్తులను అవకాశంగా తీసుకుని వారు తాత్కాలికంగా థానాను ఆక్రమించవచ్చు. కాని రఘోజీ అంగ్రే బ్రతికుండగా కొంకణతీరం ఎన్నటికీ విదేశీయుల వశంకాదు. ఇది సత్యం. ఇప్పటికే ఇంగ్లీషువారి వర్తక వ్యాపారాలన్నీ స్థంభింపజేశాం. తొందర్లోనే మోష్టిన్‌తో సహా అందరూ కాళ్ళబేరానికి రాక తప్పదు" అన్నాడు రఘోజీ అంగ్రే. అతని మాటల్లో దిటవు ఉట్టిపడింది.

"మీరుండగా పాశ్చాత్యులందరూఏకమైనా మరాఠీ రియాసత్‌ను ఏమీ చెయ్యలేరని మాకు తెలుసు రఘోజీ! మా ఆందోళనంతా దాదా సాహబ్‌ను గూర్చి మాత్రమే" అన్నాడు బారాభాయీలలో అగ్రేసరుడయిన నానాఫర్నవీసు.

ఇప్పుడు పురందర్‌కోట దేవిడీలో సమావేశమైన బారాభాయీలు ఆలోచనా తత్పరులై, దక్షిణాభిముఖులై సుదూర సీమల వేపు దృష్టిసారించి వున్నారు.

నానాఫర్నవీస్, సఖారామ్‌బాపూ, హరిపంత్‌ఫడ్కే, త్రియంబకరావుమామా, మొరోబా ఫర్నవీస్, బాబూజీ నాయక్, మాలోజీ ఘోర్పడే, భవనరావు ప్రతినిధి, రాస్తే, పట్వర్ధన్, మహదాజీ సింధియా, తుకోజీ హోల్కర్ అనే పన్నెండుగురు ప్రముఖులూ బారాభాయీలనే పేరుతో ఈనాడు పురందర్ కోటనుండి మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని నడుపుతున్నారు.

ఈ నడుమ జరిగిన చారిత్రాత్మక ఘటనలన్నీ వారి మనో వీధిలో మెరుస్తున్నాయి

దక్షిణ ద్విగిజయయాత్రకని వెళ్ళిన రఘునాధరావు తన అధి

కారాన్ని సుస్థిరం చేసుకునే తలంపుతో నిజామలీఖాన్‌తోనూ, హైద రాలీతోనూ యుద్ధ ప్రసక్తి వదిలి, సంధి సంప్రదింపులు మొదలెట్టాడు. ఈలోగా రామశాస్త్రి తీర్పు వెలువడగానే మరాఠీ ప్రముఖులంతా దాదాకు వ్యతిరేకంగా పెద్ద విప్లవం కొనసాగించారు. గర్భవతియైన గంగాబాయిని ముందు జాగ్రత్తకోసం పురందర్‌కోటకు తరలించారు. గంగాబాయి పేరిట బారాభాయీలు పాలన మొదలెట్టారు.

పుత్రఘాతకుడయిన రఘునాధరావు దాదాను ఎదుర్కొని బంధించగల సమర్థునికోసం వారు ప్రస్తుతం అన్వేషణ సాగిస్తున్నారు.

బారాభాయీలలో మహదాజీ సింధియా, తుకోజీహోల్కార్ అందుకు సమర్థులే. కాని వారిరువురూ ఉత్తర హిందూస్థానంలో నెల కొని వున్నారు. సామ్రాజ్య రక్షణకై వారిద్దరూ అక్కడ ఉండవల పిన అగత్యం ఉంది.

'మహారాష్ట్రంలో ఉన్నవారిలో దాదాను నిలవరించగలిగిన వీరాధివీరుడెవరు? ఎవరు?'

చివరికి హరిపంత్ ఫడ్కే ఇలా పలికాడు-

"మనందరిలోనూ రఘునాధదాదాను ఎదుర్కొనడానికి అర్హులైన వారు త్రియంబకరావు మామాజీ మాత్రమే. వారు వృద్ధులైనా అసమాన వీరులన్న సంగతి అందరికీ తెలుసు. పైగా వారు పీష్వాల వియ్యంకులందరిలోనూ సుప్రసిద్ధులు. హైదరాలీ పీచమణచిన వారు. నాలాంటి వారంతా వారికి తోడుగా ఉండగలం."

"ఈ సూచన బాగుంది. వారే దీనికి తగిన వారు" అన్నాడు గోపాలరావు పట్వర్థన్. అందరూ ఏకగ్రీవంగా ఈ ప్రతిపాదనను అంగీకరించారు.

అందరి తరఫున నానా ఫర్నవీసు త్రియంబకరావును అభ్యర్థించాడు.

"మామాజీ! మా అభ్యర్థనను మన్నిస్తారని ఆశిస్తున్నాము."

'నానా! ఇంతకంటె సంతోషదాయకమైన కార్యం మరే ముంటుంది? నా సర్వశక్తులూ ఈ కార్య సాధనకి ధారపోస్తాను. మీరిక నిశ్చింతగా ఉండండి. నారాయణరావు హత్యకు కారకుడైన క్షుద్రుణ్ణి ఎదుర్కొనటం ప్రతి మహారాష్ట్రుని కర్తవ్యం. జీవితంలో

మాకు ఇక మరే కోరికా లేదు. గంగాబాయమ్మ కడుపున ఒక మగ నలుసు కాస్తే చూసి ఆనందించే దాకా బ్రతికితే చాలు!"

"నాదో సందేహం. మామాజీగారన్నట్లు పురుష సంతానం కలిగితే మహారాష్ట్ర మంతా ధన్యమైపోతుంది. అలా కాని పక్షంలో మన అందరి గతి ఏమిటో అది కూడా ఆలోచించండి" అన్నాడు సఖారామ్ బాపు.

నానాఫర్నవీసు, బాపూ వైపు నిశితంగా చూశాడు. ఆదినుండీ సఖారామ్ రఘునాధుని యెడ అభిమానం కలిగి వర్తించటం అతనికి బాగా గుర్తుంది. ప్రస్తుతం 'నలుగురితో బాటు నారాయణ' గా బారాభాయీల ప్రభుత్వంలో చేరి ప్రముఖపాత్ర వహిస్తున్నాడు. అందుకే "శకున పక్షి" అని లోలోన తిట్టుకున్నాడు నానా.

"పెద్దలు, తమ నోట అలాంటిమాటలు వెలువడరాదు బాపూజీ! తప్పక వంశోద్ధారకుడైన పుత్రుడే జన్మిస్తాడు" అన్నాడు నానా సుదృఢంగా.

"పుత్రుడు కాక పుత్రిక అయితే మన కర్తవ్యం ఏమిటీ అని" సఖారామ్ మళ్ళీ రెట్టించాడు.

"కర్మకాలి అలాగే జరిగినప్పటికీ రఘునాధరావు మాత్రం పీష్వాగా కొనసాగటానికి ససేమిరా వీలులేదు."

"దాదాజీ పీష్వా కారాదనే మా అందరి కోరిక కూడా. కాని ప్రత్యామ్నాయంగా ముందుగానే ఎవరినైనా నిర్ణయించుకుంటే మంచిది కదా?" అన్నాడు మాలోజీ.

"శ్రీమంతుల వంశాంకురం మరొకటి లేక పోలేదు. ఉన్నాడు గదా మన అలీబహదూర్" అన్నాడు నానా ఫర్నవీస్.

పీష్వా బాజీరావు ప్రియురాలైన మస్తానివల్ల జన్మించిన షంషేర్‌బహదూర్ కుమారుడే అలీబహదూర్. షంషేర్ బహదూర్ పానిపట్టువద్ద మరణించాడు. అలీబహదూర్ తన తాతగారి వంశాన్ని భక్తిశ్రద్ధలతో సేవిస్తూ అనేక యుద్ధాల్లో పాల్గొని ఆరితేరి వున్నాడు.

"ఎంత బాజీరావు మనుమడైనా అతడు మహమ్మదీయుడు గదా! అతడా హిందూపద్‌షాద్‌షాహీని స్థాపించేది?" అన్నాడు సఖారామ్ బాపూ.

"హిందూపద్ షాద్ షాహీ ప్రయత్నాలు పానిపట్టులోనే అంతరించాయి. పీష్వాల రక్తం ప్రవహించే సజ్జనుడయిన ఒకయోధుని అవసరం వుండిప్పుడు. అలాంటివాడు ఒక్క ఆలీబహదూరే! కనకగంగాబాయమ్మకి పుత్రుడు జన్మించకపోతే ఆలీబహదూరే పీష్వా" అన్నాడు త్రియంబకరావు మామా నిక్కచ్చిగా.

మామాకు ఎదురాడే సాహసం అక్కడెవరికీ లేదు.

ఆలీబహదూర్ అనే ముస్లిం వీరుడు శ్రీమంతుడైతే భారతదేశ రాజకీయాలు ఎలా వుంటాయో అన్న ఆలోచనలో మునిగిపోయారు ప్రముఖులందరూ.

# 14

"ఆంధ్రదేశంలో మహారాష్ట్ర ప్రాభవాన్ని నిలబెడుతూ వచ్చింది గుత్తి ఒక్కటే. నా శక్తియుక్తులన్నీ ఉపయోగించి ఇన్నాళ్ళూ అక్కడ నిలపగలిగాను. అయితే అది నా గొప్పతనం అని నేను భ్రమించటంలేదు. పుణేలోని మహారాష్ట్ర నాయకుల సంఘీభావం చూసి జడిసి, . నిజామైగాని, అతని సామంతులైన కడప, కర్నూల్ నవాబులుగాని, హైదరాలీగాని గుత్తివైపు తేరి చూడలేకపోయారు" అన్నాడు మురారిరావు ఘోర్పడే.

అతడిప్పుడు రఘునాధరావు దాదా శిబిరంలో ఉన్నాడు. అరవైఏళ్ళు దాటిన ఆ వృద్ధ మరాఠీజోదును తనకు మద్దతుగా ఉండటానికై దాదా పిలిపించుకున్నాడు. ఔరంగజేబునే గడగడలాడించిన సంతాజీఘోర్పడే వంశీకుడు మురారిరావు. కర్నాటక యుద్ధాలలో ఇచ్ఛవచ్చినట్లు వీరవిహారం చేసి, దక్షిణభారతం అంతటా పేరు మోసిన వీరుడు. అలాంటివాడు తనకు బాసట అయితే వారసత్వయుద్ధంలో గెలుపు తేలిక అనే భావం దాదా మనస్సులో స్థిరంగా పాదుకుని వుంది.

కాని ఇప్పుడతడు ఎందుకిలా మాట్లాడుతున్నాడో దాదాకు అర్థం కాలేదు.

"ఇప్పుడయితే మాత్రం గుత్తి దుర్గం భద్రతకూ, తమ భద్రతకూ వచ్చిన అపద ఏమిటి?"

"ఇంతకన్నా ఏం కావాలి శ్రీమంత్? ఇన్నాళ్ళూ శత్రువులు తేరి చూడటానిక్కూడా వీలు లేని పీష్వా వంశానికి ఒక మాయని మచ్చ ఏర్పడింది. పుణే నగరంలో పట్టపగలు పినతండ్రి సమక్షంలో ఒక శ్రీమంతుడు దారుణంగా హత్య చేయబడినాడు. పౌరుషులేని, ఎరుగని మరాటీ నాయకుల్లో పౌరుషులు ఏర్పడి ఒకరి కుత్తుక మరొకరు ఉత్తరించటానికి సర్వసన్నద్ధమై ఉన్నారు. ఈ స్థితిలో మహారాష్ట్ర రాజ్యం శత్రువుల దృష్టిలో ఎంత చులకనై పోతోందో తమరు ఆలోచించారా? ఒక వైపు ఆంగ్లేయులు, మరో వైపు నిజామ్, ఇంకో వైపు హైదరాలీ మన సామ్రాజ్యాన్ని మట్టిపాలు చేయరా? అందరూ ఎలా వున్నా హైదరాలీ గుత్తిని కబళించికుండా ఉండగలడా?" ఆవేశంతో సంచలిస్తూ అనేశాడు మురారిరావు.

"మళ్ళీ చెబుతున్నాను- నారాయణరావు హత్య నేను చేయించ లేదు. బంధించటానికి ఆజ్ఞ యిస్తే ఆ దుర్మార్గురాలు చంపివేశారు. నాపై ఏమాత్రం గౌరవం ఉన్నా మీరిది నమ్మండి!"

"తమపై అంతులేనిగౌరవపంఉండబట్టే ఇంతగా చెబుతున్నాను శ్రీమంత్! తమరు హంతకులని నేను అనటం లేదు. కాని మహారాష్ట్రలోకం కోడై కూస్తోంది. రామశాస్త్రిగారి తీర్పు నాధారం చేసుకుని బారా భాయీలు తమపై కత్తులు నూరుతున్నారు. వారి బారి నుండి తప్పించుకొనడానికి తమరు నిజామ్‌కూ, హైదరాలీకీ జిల్లాలకు జిల్లాలే లంచంగా సమర్పించుకుంటూ మన పూర్వులు రక్తం వోడ్చి సాధించిన సామ్రాజ్యాన్ని కూలదోస్తున్నారు. ఈ విద్రోహచర్య తగదని సవినయంగా మనవి చేసుకుంటున్నాను."

పాతాళానికి క్రుంగిపోయినట్లయింది దాదాకు. 'తుదకు ఆంధ్ర దేశంలోని గుత్తికి కూడా తన అపకీర్తి లతలు పాకాయి! ఇక తన కెవరు దిక్కు?'

"మిత్రధర్మాన్ని పాటించి అయినా మీరిప్పుడు నాకు సాయపడమని వేడుకుంటున్నాను. ఒక వైపు హరిపంత్, మరోవైపు గోపాలరావు పట్వర్ధన్, ఇంకోవైపు త్రియంబకరావు మామా తరుము

కొస్తున్నారు. ఇట్టి తరుణంలో తమవంటి వారు తప్ప మరెవరు నాకు చేదోడు కాగలరు?"

"క్షమించండి శ్రీమంత్! మహారాష్ట్ర సామ్రాజ్య సంరక్షణకై చివరి రక్తపుబొట్టువరకూ ధారపోయటానికి నేను ఎప్పుడూ సంసిద్ధమే. కాని సాటి మరాఠీజోదులపై కత్తి నెత్తలేను." నిశ్చయ భావంతో మురారిరావు ఘోర్పడే కంఠస్వరం విస్పష్టంగా వినిపించింది.

క్రోధంతో రఘునాథదాదా కళ్ళు ఎర్రబారాయి. ముక్కుపుటాలుబ్బాయి.

కాని మురారిరావు అణుమాత్రమైనా బెదరకుండా ఇలా పలికాడు- "అంతేగాదు శ్రీమంత్! ఈ ఇంటిపోరు ఇంతటితోనైనా మానండి. బారాభాయీలకు మర్యాదగా లొంగిపోతే వారు కూడా తమకు ప్రభుత్వంలో తగిన స్థానం కల్పించగలరు. పరాయివారి కాళ్ళు పట్టుకుని ప్రాకులాడేకంటే, మన వారి చేతులు పట్టుకొనడం ఉత్తమం అని నా సలహా. ఆనక తమ చిత్తం" అని శిబిరం వెలువడి, అక్కడ క్షణమైనా నిలవకుండా గుత్తి దిక్కుగా పయనమైనాడు మురారిరావు ఘోర్పడే.

కర్నాటకంలో తనకున్నాడనుకున్న ఒక్కడూ అలా నిర్మొహమాటంగా చెప్పేసి వెళ్ళిపోవడంతో రఘునాథరావు నిశ్చేష్టుడయినాడు. ఎటు చూసినా ఏ దిక్కూ తోచటంలేదు. ఆనందీబాయి దుర్బోధలకు చెవియొగ్గిన తన తెలివితక్కువతనానికి నిందించుకున్నాడు. ఎవర్నని ఏం ప్రయోజనం? తాను తవ్వుకున్న గోతిలో తాను పడుతున్నాడని పిస్తోంది.

రఘునాథరావులో పౌరుషం తలెత్తింది.

'ఆ గొయ్యి తను తవ్వలేదు. తవ్వని గొయ్యిలో పడవలసిన అగత్యం తనకు పట్టలేదు. పీష్వా గద్దెను వదలరాదు-ఏది ఏమైనాసరే!'

"సర్కార్!" తులాజీపవార్ బెరుకుగా పలకరించాడు.

ఏమిటి చెప్పమన్నట్లు చూశాడు దాదా.

"కసేగాంవ్ వద్ద త్రియంబకరావు మామా కొద్ది సైన్యంతో మాత్రమే ఉన్నట్లు తెలిసింది."

"ఆ సంగతి నాకూ తెలుసు. అతన్ని మభ్యపెట్టడానికి సంధి సంప్రదింపులు అనే నాటకం జరుపుతున్నాం గదా?"

"అవును సర్కార్। వారిప్పుడు సంప్రదింపుల్ని నమ్మి చాలా బేఫర్వాగా ఉన్నారని తెలుస్తోంది వారి పని పట్టడానికి ఇదే తగిన తరుణం"

"తప్పక. ఈ ముసలిసక్కను తొలిగిస్తే ప్రస్తుతానికి పీడే వొదిలిపోతుంది. ఇలాంటి వారియెడ వెన్నుపోటే తగిన సాధనం. ఇంకా ఆలస్యం ఎందుకు? సైన్యం సిద్ధం చేయించు. హరిపంత్ అతనికి సాయంగా రాకముందే కడతేర్చాలి."

క్షణాలపై ఫౌజు సిద్ధమైంది.

పండరీపురంనుండి కసేగాంవ్‌కు ఎనిమిది మైళ్ళు. అతి త్వరలో ఎనిమిది మైళ్ళు గడిచి అజాగ్రత్తగా వున్న త్రియంబకరావు మామా శిబిరాలపై విరుచుకుపడ్డాడు దాదా. తన సైన్యం ఎదుటి సైన్యంలో నాలుగోవంతు లేకపోయినా మామాజీ జంకక వారి నెదుర్కొన్నాడు. దండును పురికొలుతూ ఎక్కడ చూపినా తానేపై విజృంభించాడు. అతని ధాటికి రఘునాథదాదా యొక్క అపార సైన్యం కూడా వెనుకంజ వేసింది. ఇక లాభం లేదని తన ఫిరంగి దళాన్ని పురికొల్పాడు దాదా. నాలుగువైపులా ఫిరంగులు మోహరించి మామాజీ దళంపై గుళ్ళవర్షం కురిపించాయి. అశ్వారూఢుడైన మామా ముసలి సింహంవలె విజృభించి ఫిరంగులు ప్రేల్చే గార్దీలను పలువుర్ని నరికి వేశాడు. కాని తుదకు ఒక బలమైన ఖడ్గప్రహారానికి గురియై గుర్రంపై ఒరిగిపోయాడు. వెంటనే రఘునాధుని సైనికులు అతన్ని బంధించారు. మామాజీ దళంలోని హతశేషులు పారిపోయారు.

త్రియంబకరావు మామా ఉదరభాగంలో బలమైన ప్రేటు తగిలింది. ప్రేగులు వెలువడ్డాయి. రక్తం ఉవ్వెత్తున ప్రవహించసాగింది. అయినప్పటికీ ఆ వృద్ధశూరుడు చలించలేదు. పొట్టచుట్టూ గట్టిగా వస్త్రం చుట్టి నిటారుగా నిలబడ్డాడు.

గార్దీలతన్ని దాదాసాహెబ్ ఎదుట నిలబెట్టారు.

తన తండ్రి బాజీరావుచే 'బావా' అని పిలవబడినవాడు, సదాశివభావోకు మేనమామ, చిన్ననాడు తనను ఎత్తి పెంచిన మామ,

అనేక యుద్ధముల్లో ఆరితేరిన వృద్ధమూర్తి త్రియంబకరావు మామాను ఆ స్థితిలో చూడగానే రఘునాధరావులో కరుడుగట్టిన కక్ష అంతా కరిగిపోయింది. అతని కళ్ళంట బాష్పబిందువులు జలజల రాలాయి.

"మామా!" అంటూ చేరవచ్చాడు.

కాని త్రియంబకరావు ఒక అడుగు వెనక్కివేసి "నన్ను ముట్టకు పుత్రఘాతకుడా!" అన్నాడు రూక్షస్వరంతో.

రక్తం వెల్లువలయి ప్రవహిస్తూ ప్రాణాపాయదశలో ఉండీ దాదాజీని తూలనాడిన మామాజీని మొరటుగా ఈడ్చుకుపోయి ఓ చోట బంధించారు గార్డీలు. ఎలాంటి వైద్య సదుపాయమూ కలిగించలేదు. అధికంగా రక్తం కోల్పోవడంవల్ల త్రియంబకరావుకు స్పృహ తప్పింది. మరునాడు ఉదయానికి మామాజీ మరణించి వున్నాడు. అతని శవాన్ని సగౌరవంగా పురందర్‌కోటకు పంపించాడు రఘునాధరావు ముప్ఫయిఏళ్ళుగా మరాఠీ సైన్యానికి పట్టుగొమ్మవలె నిలిచిన త్రియంబకరావు మరణానికి మహారాష్ట్రులంతా విలపించారు. తమ కుడిభుజం కూలిపోయిందని బారాభాయీలు వాపోయారు. హరిపంత్ వారి నోదార్చి రఘునాధదాదా అంతు చూస్తానని ప్రతిజ్ఞ చేశాడు.



# 15

నేడు క్రీ.శ. 1774 ఏప్రియల్ 18 వ తేదీ. ఈ రోజు పురందర్ కోట దేవిడీలో ఆసీనులైవున్న బారాభాయీలు పొద్దుటినుండీ ఆందోళనతో సతమతమవుతున్నారు.

వీరాధివీరుడైన త్రియంబకరావు మామా మరణం వారినిప్పుడు కలతపెట్టడంలేదు. అంతకంటేనూ-ఇంకా చెప్పాలంటే-అన్నిటికంటేనూ కూడా ప్రముఖమైన విషయం వారిని కలగుండు పరుస్తూంది.

ముఖ్యంగా నానాపర్నవీసు మనస్సు మనస్సులోలేదు.

అంతఃపురంలో గంగాబాయి ప్రసవవేదన అనుభవిస్తోంది. ఆమె దగ్గర పార్వతీబాయి, దుర్గాబాయి ఉన్నారు. కోటలోనివారంతా

కలగబోయే సంతానం గురించి వేయి కళ్ళతో ఎదురుచూస్తున్నారు.

లోలోపల ఎంత కలతపాటు ఉన్నా, నానాఫర్నవీసు పైకి మాత్రం నిర్లిప్తంగా ఉన్నాడు. పురుష సంతానమే కలగాలని అతడు వేయి దేవతలకు మొక్కుకుంటున్నాడు. అయితే కర్మవశాత్తు ఆడ పిల్ల పుట్టినప్పటికీ పరిస్థితి నెదుర్కొనటానికి అతడు సర్వసన్నద్ధుడై ఉన్నాడు. క్షణాలపై అలీబహదూర్‌ను పీష్వాగా ప్రకటించడానికి అన్ని ఏర్పాట్లూచేసి వుంచాడు. కీడెంచి మేలెంచడం నానా రాజనీతి.

"ఉన్నాడు. భగవంతుడున్నాడు. శిష్టరక్షణ, దుష్టశిక్షణ చెయ్యడానికి తప్పక అవతరిస్తాడు. సందేహంలేదు" అని పాటికి పదిసార్లు అనుకున్నా అతని మనస్సు నిమ్మళించడం లేదు.

'ఈరోజు కోసమే తను ఇన్నాళ్ళూ ఎదురుచూశాడు. ఈరోజు కోసమే బహుశా భారతదేశమంతా ఎదురుచూస్తోంది.

అబ్బ! రాజకీయాలు ఎంత భయంకరమైనవి! గంగాబాయికి మగబిడ్డే పుట్టాలి, ఆయురారోగ్యాలతో వర్ధిల్లాలి, విద్యాబుద్ధులునేర్వాలి వీరుడు, దక్షుడు కావాలి. ఈలోగా దాదా సంగతి చూడాలి. ఇన్ని గడిస్తే తన పూనిక నెరవేరుతుంది.'

దాసీ పరుగు పరుగున వచ్చింది.

క్షణకాలం నానా గుండె ఆగినట్లయింది.

"అయ్యలారా! శుభవార్త!"

బారాభాయిలంతా ఎగిరి గంతేశారు.

"మగబిడ్డ!"

"శ్రీమంతుడు జన్మించాడు" అన్నాడు నానా ఉద్వేగం అణచుకుని. తక్కిన భాయిలు నానావలె నిగ్రహం పాటించలేదు ఒకర్నొకరు కౌగిలించుకున్నారు. ఒకరి నోట్లో ఒకరు పంచదార పోసుకున్నారు.

నిమిషమాత్రంలో పురందర్‌కోట అంతా ఆనందకోలాహలం చెలరేగింది. ఎక్కడ విన్నా "శ్రీమంతుడు పుట్టాడు" అన్న మాట తప్ప మరోటి వినబడటంలేదు.

పుణేనగరంలో ఈ వార్త తెలియగానే పౌరులంతా పండగ చేసుకున్నారు. ఉత్సవాలు, వేడుకలు కొనసాగాయి. మహారాష్ట్ర

సామ్రాజ్యమంతటా దేవతార్చన జరిగింది. మిఠాయీలు పంచిపెట్ట బడ్డాయి.

అప్పటివరకూ అటూ ఇటూ ఊగిసలాడుతున్న కొద్దిమంది సర్దారులు కూడా ఇప్పుడు బారాభాయీల పక్షాన చేరటంతో రఘునాధ రావు ఏకాకి అయినాడు. దక్షిణాదిన తనకు రక్షకులెవరూ లేరని గ్రహించాడు. తులాజీపవార్‌ను హైదరాలీ కొప్పగించి ఉత్తర దిక్కుగా పారిపోవడం మొదలెట్టాడు. కాని పుణె సైన్యం అతన్ని వెన్నంటి తరమసాగింది. నాగ్‌పూర్‌లోని మధోజీ భోన్స్లేకు మహమ్మద్ యూసఫ్‌ను ఒప్పగించి ఇందోరు దిక్కుగా పయనం సాగించాడు దాదా.

నవజాత శిశువు-పీష్వా మాధవరావువలె గొప్పవీరుడు, ఉత్తమ పాలకుడు కావాలన్న ఆకాంక్షతో అతనికి మాధవరావు నారాయణ్ అన్న నామకరణం చేశారు. అతనికే సవై మాధవరావు అన్న నామాంతరం కూడా కలిగింది.

ఓ నెల గడిచాక ఛత్రపతినుండి ఆ శిశువునే పీష్వాగా నియమిస్తూ ప్రకటన వెలువడింది.

# 16

ఉత్తర మధ్యభారతాలలో మహారాష్ట్ర ప్రాభావానికి పట్టుగొమ్మలు సింధియా, హోల్కార్లు. రానోజీ సింధియా గ్వాలియర్‌లోనూ, మల్హారరావు హోల్కార్ ఇందూర్‌లోనూ పీష్వాకు లోబడి సుస్థిర రాజ్యాలు స్థాపించి వున్నారు. ప్రస్తుతం ఇందూర్ రాజ్యాన్ని మల్హార రావు కోడలు అహల్యాబాయి పరిపాలిస్తోంది దానధర్మాలకు పేరొందిన ఆమె ప్రజలను కన్నబిడ్డల్లాగా చూస్తోంది. అహల్యాబాయి అంటే భారతావని అంతటా భక్తి ప్రపత్తులున్నాయి. మహేశ్వర్‌లో పూజాపునస్కారాలతో కాలం వెళ్ళబుచ్చుతున్నప్పటికీ రాజకార్యాలు ఏమరలేదు. సైన్యం అంతా తుకోజీ హోల్కార్ అనే వీరుని అధీనంచేసి ఏలుతోంది ఆ వృత్తమురాలు.

అలాంటి ఇందూరు రాజ్యంలోనికి అడుగు మోపాడన్నమాటే గాని, రఘునాధరావుదాదా ప్రతి క్షణమూ సిగ్గుతో చిమిడిపోతున్నాడు. తుకోజీ హోల్కార్ అతని స్నేహితుడే! అతనితో దాదాకు ఎలాంటి పేచీ లేదు. ఆ మాటకొస్తే అహల్యాబాయితో కూడా అతనికి పేచీ ఉండవలసిన అవసరం లేదు. కాని ఒకప్పుడు—అంటే ఎనిమిదేళ్ళ క్రితం ఆమె యెడ తన దౌర్జన్య ప్రవర్తన ఫలితంగా తనకు కలిగిన అవమానం తలిస్తే, ఇందూర్‌లో అడుగు మోపడం కూడా కష్టమే మరి!

గత స్మృతులు దాదా మదిలో మెదిలాయి.

1766లో మల్హారరావు హోల్కార్ మరణించాడు. అంతకు ముందే అతని ఏకైక పుత్రుడైన ఖండేరావు మరణించడంవల్ల కోడలు అహల్యాబాయి తన కుమారుడైన మాలేరావును గద్దె నెక్కించి పటిష్ఠంగా రాజ్యపాలన చెయ్యసాగింది. కాని దురదృష్ట వశాత్తు వ్యసనపరుడైన మాలేరావు పుత్రసంతానం లేకుండానే పరమపదించాడు. హోల్కార్ రాజ్యం, దానికి సంబంధించిన అపారమైన ఖజానాపై అందరికళ్ళూ పడ్డాయి. ముఖ్యంగా రఘునాధదాదా గద్ద కళ్ళు ఇందూరుపై వాలాయి. తన యిష్టం వచ్చిన వాణ్ణి గద్దెనెక్కించి బొక్కసం అంతా కొల్లగొట్టే దురుద్దేశంతో పెద్దదండుతో మధ్యభారతం పైకి దండెత్తి వచ్చాడు.

కాని అహల్యాబాయి ఎంత మాత్రమూ బెదరలేదు. ప్రాణాలు ధారపోసి అయినా హోల్కార్ వంశ ప్రతిష్టనూ, రాజ్యాన్నీ కాపాడాలనే నిశ్చయానికి వచ్చింది. సైన్యాన్ని ప్రతిఘటనకు సిద్ధం చేసింది. గాయక్వాడ్, భాన్స్లే, సింధియా మున్నగు గొప్ప సర్దారు లంతా ఆమెకు మద్దతు తెలిపారు. చివరకు పీష్వా మాధవరావు కూడా ఆమె యెడ సానుభూతి ప్రకటించాడు.

ఇట్టి తరుణంలో అహల్యాబాయి రఘునాధరావుకు ఈ క్రింది విధంగా లేఖను పంపింది.

"మల్హారరావు హోల్కార్ తమ చివరి నెత్తుటి బొట్టువరకూ మహారాష్ట్ర సామ్రాజ్యం కోసమే శ్రమించారు. అట్టి హోల్కార్

రాజ్యాన్ని వారు పోగానే తమరు కబళించాలని కలలు కంటున్నారు. అహల్యాబాయిని ఒక స్త్రీమాత్రురాలిగా భావించి తమరు అహంకారంతో దండెత్తి వస్తున్నారు. అందువల్ల తమకు స్త్రీ సైన్యమే స్వాగతం పలుకుతుంది. మీరు మా స్త్రీలను ఓడిస్తే మాకు వచ్చే చిన్నతనమేమీ లేదు. స్త్రీలతో పోరాడిన ఘనత తమకు దక్కుతుంది. ఇక స్త్రీలతో పోరాడి ఓడిపోతే తమ పరువు ఏమైపోతుందో తలిస్తే తమపై జాలి కలుగుతోంది."

పరిస్థితిని గమనించి తన పొరపాటును గుర్తించాడు దాదాజీ. అందువల్ల ఎలాగైనా గౌరవంగా బయటపడే మార్గాలు అన్వేషించాడు. చివరికి 'పుత్రశోకం చేత వ్యధ చెందుతున్న అహల్యాబాయిని పలకరించి పోవటమే తన రాకకు కారణ'మని చల్లగా కబురంపాడు.

అహల్యాబాయి సగౌరవంగా అతన్ని తన శిబిరానికి ఆహ్వానించి నజరానాలు సమర్పించింది. దుర్భరమైన పరాభవంతో తల దించుకుని రఘునాధరావు పుణే మార్గం పట్టాడు.

ఆ విషయం ఇప్పుడు తలుచుకున్నా తలవంపుగానే ఉంది దాదాకు.

ఒకప్పుడు ఏ ఇండూరును కబళించాలనుకున్నాడో ఇప్పుడా ఇండూర్‌లోనే తలదాచుకోవలసి వస్తోంది. అయితే అహల్యాబాయి ప్రస్తుతం ఎక్కువగా మహేశ్వర్‌లో ఉంటోంది. కనుక సేనాని అయిన తుకోజీరావు హోల్కర్‌తో సంప్రదిస్తే సరిపోతుంది. అది కొంత నయం. ఎందుకంటే తుకోజీ తన మిత్రుడూ, అనుచరుడూను.

అలాగే మహదాజీ సింధియా కూడా తనకు బాసటగా నిలవొచ్చు. మహదాజీ వారసత్వం విషయంలో కూడా తను ఆటంకం కల్పించిన మాట వాస్తవమే. కాని ఇప్పుడవన్నీ మనసులో పెట్టుకోక పోవచ్చు.

అందుకే ఉజ్జయినిలో బిడారా వేసి ఇద్దరు సర్దార్లనూ అభ్యర్థించాడు. కాని బారాభాయీల రాయబారులు కూడా అతని వెన్నంటే వచ్చి, హోల్కర్ సింధియాలను కలుసుకుని రాజద్రోహిని పట్టి అప్పగించవలసిన అగత్యం గురించి నొక్కి చెప్పారు. కాని పీష్వా

బాజీరావు కుమారుని బంధించటానికి వారు సాహసించలేదు. అలా అని మిన్నకుండలేక పోయారు. బారాభాయీలకు సగౌరవంగా లొంగిపోవటమే శ్రేయస్కరమని నచ్చ జెప్పటానికి ప్రయత్నం చేశారు.

వారిద్దరిపై నమ్మకం కోల్పోయాడు దాదాజీ. అందువల్లనే ఇటు అయోధ్య నవాబుతోనూ, అటు కలకత్తాలోని వారన్ హేస్టింగ్స్‌తోనూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరపనారంభించాడు.

* * *

"పీష్వా నారాయణరావు వధతో తమకేమీ సంబంధం లేక పోవచ్చు. ఆ విషయమై ఇప్పుడు మేము తమరిని శంకించటంలేదు. జరిగిందేదో జరిగిపోయింది. ఎవరెన్ని విధాల అనుకున్నా పంత్ ప్రధాన్ తిరిగి సజీవులు కాలేరు. కనుక ఆ ప్రసక్తి వదిలేద్దాం. కాని ఈనాడు గంగాబాయమ్మగారికి పుత్రప్రాప్తి కలిగింది. కనుక న్యాయతః సవై మాధవరావుగారే పీష్వా కావలసి వుంది. ఇందుకు ఛత్రపతి కూడా అంగీకరించారు. ఇట్టి పరిస్థితుల్లో తమరు పీష్వా పదవిని వొదులుకున్నట్లూ, సవై మాధవరావు పీష్వాను సేవించ టానికి సిద్ధంగా వున్నట్లూ ఒక ప్రకటన చేస్తే చాలు! నానాఫర్నవీసు తమ జోలికి రాకుండా మేం కట్టుదిట్టం చెయ్యగలం. దయచేసి తమరు మనస్సు మార్చుకోవాలని మా ప్రార్థన" అన్నాడు మహదాజీ సింధియా మిక్కిలి వినయంగా.

"నా మనవి కూడా అదే దాదా సాహబ్!" అన్నాడు తుకోజీ హోల్కర్ మరీ వినయంగా.

రఘునాధరావు నొసలు చిట్లించాడు.

"మహారాష్ట్ర సామ్రాజ్యంకోసం ఇరవై ఏళ్ళ నుంచీ పాటు బడుతున్న వాణ్ణి నన్ను పక్కకు నెట్టి, నిన్న మొన్న కన్ను తెరిచిన పసి గుడ్డును ప్రధాన్‌గా అంగీకరించడం మీకు న్యాయంకాదు. పైగా ఇంత రభస జరిగాక ఏదో ఒకటి తేలకుండా మిన్నకుండటం అసంభవం. అసలింతకీ ఆ పసివాడు మా నారాయణరావు సంతానం అన్న నమ్మకం ఏముంది? నానాఫర్నవీసు జిత్తులు మీకు తెలియనివి

కావుగదా? ఎవరో ఒక మగశిశువును గద్దెపై కూచోబెట్టి నాటకమాడుతున్నారని నా సందేహం।"

ఈ ఆరోపణకు సింధియా ముఖంలో క్రోధచ్ఛాయలు తాండవించాయి. కాని తుకోజీ హోల్కార్ తొందరపడదలచలేదు.

"దాదాసాహబ్। ఇవి తమవంటి సద్బ్రాహ్మణులనోట రాదగిన మాటలు కావు. శ్రీమంత్ సవై మాధవరావుగారు గంగాబాయమ్మగారికే జన్మించారనటానికి ప్రబల సాక్షులున్నాయి. పార్వతీబాయమ్మగారూ, తమ కుమార్తె దుర్గాబాయమ్మగారూ ప్రసవ సమయంలో చేరువనే ఉన్నారు. వారు తమ వంశాంకురమనే ప్రకటించి వున్నారు. కనుక తమరిలాంటి ప్రచారాలు మానాలని మనవి చేస్తున్నాము."

"అంతే కాదు దాదాజీ। హరిపంత్ ఫడ్కే తమ వెన్నంటి తరుముకొస్తున్నారు. తమరిని పట్టి అప్పగించమని మమ్మ ఒత్తిడి చేస్తున్నారు. శ్రీమంతుల వంశీకులూ, మాతో ఇన్నాళ్ళూ కలిసి వున్నవారూ, ప్రాణభీతితోనున్నవారూ అయిన తమరిని బంధించటం ఇష్టం లేకనే ఇంతగా బ్రతిమాలుతున్నాం. తమరు యావత్తు మహారాష్ట్ర జాతికే ద్రోహం తలపెడుతూ అయోధ్య నవాబుతోనూ, కలకత్తాలోని ఇంగ్లీషువారితోనూ జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలు మాకు తెలియకపోలేదు. ఇకనైనా సద్బుద్ధి కలిగి వర్తించమనీ, బారాభాయీలకు లొంగి పొమ్మనీ చివరిసారిగా వేడుకుంటున్నాం" అంటూ సింధియా శిబిరం లోపలికి వెళ్ళిపోయాడు. సింధియా పలుకుల్లోని బెదిరింపు గమనించి రఘునాథదాదా భీతి చిత్తుడైనాడు.

కాస్సేపయిన తరువాత హోల్కార్ కూడా దాదావద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

'ఇక హోల్కార్, సింధియాలను నమ్మి లాభంలేదు. మార్గాంతరం చూడాలి. ఏమైనాసరే- బారాభాయీల అంతు చూడక తప్పదు. మళ్ళీ సామ్రాజ్యధిపతి కాక తప్పదు' అనుకున్నాడు దాదాసాహబ్ కసిగా.

ఆ మరునాడే హోల్కార్, సింధియాల కన్నుగప్పి సతీ

సమేతంగా ధార్‌కు పారిపోయాడు. ధార్‌నేలే మరాఠీ సర్దార్ ఖండే రావ్ పవార్ రక్షణలో ఆనందీబాయిని ఉంచి గుజరాత్ వైపుగా పలాయనం చిత్తగించాడు. గుజరాత్ పాలకుడైన గోవిందరావు గాయక్వాడ్ అతనికి ఆశ్రయం ఇచ్చాడు.

కాని హరిపంత్ రఘునాధరావును వెన్నంటి తరుముతూ గుజరాత్ లోనికి చొచ్చుకువచ్చాడు. బరోడా సమీపంలో జరిగిన సంగ్రామంలో చిత్తుగా ఓడిపోయి, రఘునాధరావు సరాసరి సూరత్‌కు పారిపోయి ఆంగ్లేయుల శరణుజొచ్చాడు.

ఇలాంటి అదనుకోసమే ఇన్నాళ్ళూ కాచుకుని వున్న ఇంగ్లీషు వారు అతనికి అభయం ఇచ్చారు. 500 మంది ఇంగ్లీషువారితోనూ, 1800 మంది సిపాయీలతోనూ తనకు బాసటగా వచ్చి పీష్వా గద్దెపై నిలిపినట్లయితే, బొంబాయి చుట్టుపట్లనున్న థానా, బాసీన్, సాల్ సెట్టి ద్వీపాలను ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీవారికి శాశ్వతంగా ఇచ్చివేయడానికి ఒప్పుకున్నాడు రఘునాధరావు.

అలా తన స్వార్థం కోసం శివాజీ, బాజీరావుల వంటి మహనీయులు స్థాపించి, పెంపొందించిన మహారాష్ట్ర స్వాతంత్ర్యాన్ని విదేశీయులకు తాకట్టు పెట్టాడతడు. స్వాతంత్ర్యాన్ని తాకట్టు పెట్టడంతోబాటు ఆరు లక్షలు విలువచేసే తన నగలను బొంబాయి కంపెనీవారికడ తాకట్టు పెట్టాడు.

మోష్టిన్ ప్రయత్నాలు ఇన్నాళ్ళకు ఫలించాయి. బారభాయీల బాధ్యతలు పెరిగాయి. తొలుత కుటుంబ కలహంగా ప్రారంభమైనది తుదకు భారతజాతీయ సమస్యగా రూపొందింది. మహారాష్ట్ర జాతి, దానితోబాటు హైదరాలీ తదితర జాతీయనాయకులందరూ ఆంగ్లేయులను ఎదుర్కొనడానికి నడుం బిగించారు.

# 17

**1778** నవంబరు 24 వ తేదీ బొంబాయి రేవు పట్టణం మున్నెన్నడూ ఎరుగనంత కోలాహలంగా ఉంది. పట్టణ మైదా

నంలో సిపాయీలు బారులు తీర్చి నిలిచి వున్నారు. ఎగర్టన్ దొర గారు ఆజ్ఞ ఇవ్వడమే తడువాయి పుణేవైపు పరుగులు తియ్యడానికి వారంతా సర్వసన్నద్ధులయి ఉన్నారు.

కాని ఫిరంగి శకటాలు, ఆహారసామగ్రి ఇంకా సిద్ధం కాలేదు. అందువల్ల ఎగర్టన్ దొరగారు తొందరపడటంలేదు.

ఎగర్టన్ సైన్య విభాగాలన్నింటినీ తేరిపారజూచారు. 500 మంది ఇంగ్లీషు సోల్జర్స్, 2000 మంది సిపాయీలు వీరికి తోడు రఘునాథదాదా వారి సైనికులు 7000. ఇంగ్లీషు దళంలో స్టెవర్ట్, కే, కాక్‌బర్న్‌వంటి ఉద్దండులున్నారు.

ఎగర్టన్ ముఖంలో తృప్తి వెల్లివిరిసింది.

'చాలు! ఈ మాత్రపుసేనతో బొంబాయినుండి కలకత్తావరకూ నిరాఘాటంగా సాగిపోవచ్చు. పుణే ఎంత? దాని బిసాతు ఎంత?

కొంతదూరాన నిలబడి ఖరక్‌సింగ్‌తో మాట్లాడుతున్న రఘు నాథ దాదాపై ఎగర్టన్ దృష్టి ప్రసరించింది. వెంటనే అతని వదనం అసహ్యభావంతో నిండిపోయింది.

'ఇంతటి అసమర్థుడూ, కుటిలుడూ వ్యసనపరుడూ పీష్వాల వంశంలో పుట్టివుండడు. ఈ మూడేళ్ళనుండీ కంపెనీవారికి ఇతని వల్ల ఎంత నష్టం. కలకత్తా, మద్రాసు కంపెనీలతో సమంగా ఏదో సాధిద్దామని ఇతని పక్షం వహించినందుకు బొంబాయి వారికి నేటి వరకూ పిసరంతైనా లాభం కలగలేదు. పైపెచ్చు గవర్నర్ జన రల్‌కూ, గవర్నరుకూ మధ్య పొరపులు, మనస్తాపాలు. పుణేగద్దెపై ఇతన్ని మళ్ళీ నెలకొల్పడానికి ప్రయత్నాలు చేస్తున్నా ఇతగాడికి తృప్తి అనేది కలగటంలేదు. ఎప్పుడూ ఒకటే సాధింపు! నలభై రెండేళ్ళు ఇంకా నిండకపోయినా మనిషిని చూస్తే అరవైఏళ్ళవాడిలా వున్నాడు. దుర్వ్యసనాలు మితిమీరితే ఏమవుతుంది మరి? సైన్యం నడపగలశక్తి ఇతనికి ఏ మాత్రమూ ఉన్నట్లు లేదు.'

రఘునాధదాదా తనవైపే రావడం గమనించి ఎగర్టన్ తన దృష్టిని సైన్యంవేపు తిప్పాడు.

"దొరగారేదో దీర్ఘాలోచనలో మునిగినట్లున్నారు?"

"పుణే చేరే లోపల మనకు సాయపడగలవారెవరూ అని?"

"నా మాట నమ్మండి దొరగారూ! ఒక్క నానాఫర్నవీస్ తప్ప బారాభాయిల్లో అందరికీ నేనంటే అభిమానమే. అందులోనూ ముఖ్యంగా మొరోబా ఫర్నవీస్‌కు నేనంటే ప్రాణం. అతడూ, సఖారామ్ బాపూ కలిసి నన్ను తరలి రమ్మని కబురంపితేనా గదా మనం ప్రయాణం సాగిస్తున్నాం!"

"నిజమే. కాని మొరోబా ఫర్నవీసు, బాపూల కుట్రలను మహదాజీ సింధియా అణిచివేశాడని అంటున్నారు గదా! పైగా మొరోబాను ఖైదు చేశారట! అలాంటి పరిస్థితిలో మనకు మద్దతిచ్చేదెవరు?"

"సంశయించకండి దొరగారూ! ఈ రఘునాధ దాదా అంటే మరాఠీ సైన్యంలోనూ, ప్రజల్లోనూ ఎనలేని భయభక్తులున్నాయి. నానాఫర్నవీసుకు జడిసి ఎవరూ బయటపడరు. అంతే! ఎదురులేని ఇంగ్లీషుసేనతో నేను తరలి వస్తూంటే ప్రజలంతా స్వాగతం పలుకుతారు. నిజామ్, హైదరాలీ మున్నగు వారంతా అటునుంచి నరుక్కువస్తారు. నా మాట నమ్మండి!"

ఎగర్టన్ నవ్వాడు.

"దాదాసాహబ్! మీ మీదా, ప్రజలమీదా విశ్వాసంతో మేం బయలుదేరటం లేదు. 500 మంది ఇంగ్లీషు సోల్జర్సు చాలు—బారాభాయీలనందర్నీ కూలదోయటానికి. ఒక్కొక్క ఇంగ్లీషు సోల్జర్సె 50 మంది మరాఠీ సైనికుల పెట్టు" అంటూ ఫిరంగి శకటాలను పర్యవేక్షించడానికి వెళ్ళిపోయాడు.

మహారాష్ట్ర శౌర్యసారాన్ని ఎగర్టన్ ఎకసక్కెమాడిన తీరుకు రఘునాధ దాదాకు ఒళ్ళు మండిపోయింది. కాని నిస్సహాయంగా నిట్టూర్పు విడిచాడు. 'అజేయమై, శత్రుదుర్నిరీక్ష్యమై వెలుగొందిన మహారాష్ట్ర ప్రభకు తనవల్ల ఎలాంటి గతి పట్టింది? ఆరేళ్ళక్రితం వరకూ మహారాష్ట్రం వైపు కన్నెత్తి చూడటానికిక్కూడా జంకే తెల్లకుంకలకు ఎన్ని కాళ్ళు తెచ్చాడు తను?'

తన్ను తానే నిందించుకుంటూ పశ్చాత్తాపంతో కుమిలిపోయాడు.

'తను వ్యర్థుడు! కులద్రోహి! దేశద్రోహి! అందుకే దురదృష్ట

దేవత తన్ను వెన్నాడుతోంది. వ్యసనపరుడు కనకనే కడకు తన ప్రియభార్య ఆనందీబాయి కూడా తన్ను అసహ్యించుకుని ధార్‌కు వెళ్ళిపోయింది.'

కాస్సేపట్లో భేరీలు, నగారాలు మ్రోగడంతో ఆలోచనలనుండి తెప్పరిల్లాడు రఘునాధరావు. సైనికుల్లో ఎక్కడ చూసినా మహోత్సాహం పరవళ్ళు తొక్కుతోంది. వారి ఆయుధాలు ఎండలో తళతళ మంటున్నాయి.

"శ్రీమంత్ పంత్ ప్రధాన్ రఘునాధరావు దాదా సాహబ్‌కీ జయహో!" అన్న నినాదం ఒక్కుమ్మడిగా చెలరేగింది.

ఆ నినాదం దాదాజీ హృదయనిర్వేదాన్ని ఒక్కసారిగా పటాపంచలు చేసింది. ఇంగ్లీషువారిపై క్రోధం, అసహ్యం అంతా ప్రేమగానూ, మెప్పుగానూ మారిపోయింది.

'నిజంగా ఆంగ్లేయులు అసమాన పరాక్రమశాలురు, అజేయులు. వారి క్రమశిక్షణ అపూర్వం. కనుకనే రెండువందలమందితో ఆర్కాటు విజయం పొందారు. కర్నాటకంనుండి ఫ్రెంచివారిని తరిమివేశారు. బుస్సీ దొర అంతటివాడిని ఖైదు చేశారు. సురాజుద్దౌలాను ఓడించి బెంగాల్‌ను ఆక్రమించుకున్నారు. నిజామును బెదిరించి ఉత్తర సర్కారును లాక్కున్నారు. మొగల్ చక్రవర్తిని, అయోధ్యనవాబును సులభంగా వశపరుచుకున్నారు. అంతటివారికి బారాభాయీలొక లెక్కా? వారంలోగా పుణేను ఆక్రమించి తనను పీష్వాను చేస్తారు. మళ్ళీ యావద్భారత దేశంపై తన ప్రభ వెలుగుతుంది.'

భాసురమైన భావి అతని కళ్ళకు కట్టినట్లయింది.

# 18

"శివాజీ మహారాజు మరణించి ఇంకా వందఏండ్లు నిండలేదు. ఇంతలోనే పీష్వాలు నిర్మించిన సామ్రాజ్యం తెల్లవారి హస్తగతం కావలసిందేనా? ఒక దేశద్రోహివల్ల భారత స్వాతంత్ర్యం మట్టిపాలు

కావలసిందేనా? మన బొందిలో ఊపిరి ఉండగా అలా జరగటానికి ఎన్నటికీ వీలులేదు" అని ఉద్ఘాటించాడు నానాఫర్నవీస్. అతని స్వరంలో దృఢనిశ్చయం ధ్వనించింది. తక్కిన భాయీలందరూ ఆవేశంతో చలించిపోతున్నారు. అందరికంటె మహదాజీసింధియా పూనిక బలవత్తరంగా కనబడుతోంది.

"ఆర్కాట్, బెంగాల్, దక్కన్ సుబాలవలెనే మహారాష్ట్రం కూడా తేలిగ్గా లొంగిపోతుందని ఆంగ్లేయులు భ్రమిస్తున్నారు. వారి కలలు కల్లలే అని నిరూపించాలి. అందుకు ఒక్కటే ఉపాయం. ఇంగ్లీషువారిని సురాజుద్దౌలావలె నేరుగా ఎదుర్కొనటం వ్యర్థం. శివాజీ మహారాజు, సంతాజీ ఘోర్పడే వంటి పూర్వవీరులు మనకు నేర్పిన గెరిల్లా యుద్ధపద్ధతుల వల్లనే విదేశీయులను మట్టుపెట్టవలసి వుంది."

సింధియా ప్రతిపాదనకు భాయీలంతా ఏకగ్రీవంగా అంగీకరించారు.

"ఈ పథకం కూడా నేను ముందుగానే ఆలోచించాను. బొంబాయినుండి పుణేకువచ్చే మార్గంలో పచ్చగడ్డి కూడా మొలవడానికి వీల్లేదు. పంటలన్నీ ధ్వంసం చేద్దాం. పల్లెలన్నీ నిర్మానుష్యం అయిపోవాలి. చెరువుల్లో ఒక్క చుక్క నీరు మిగలరాదు. ఆకలి దప్పులతో ఆంగ్లేయులు మలమలమాడి మసైపోయేదాకా ఈ పోరాటం కొనసాగించవలసిందే" అన్నాడు నానా.

"అంతేకాదు, వారవలంభిస్తున్న భేదోపాయం మనమూ అవలంభించాలి. నేటినుండి వారి శత్రువులంతా మన మిత్రులు. వారి మిత్రులంతా మన శత్రువులు. కనుక ఫ్రెంచివారితోనూ, పోర్చుగీసు వారితోనూ, డచ్చివారితోనూ సంప్రదింపులు జరిపి ఆంగ్లేయులపై పురికొల్పాలి" అన్నాడు హరిపంత్ ఫడ్కే.

"భేష్! భేదోపాయాన్ని మించిన నీతిలేదు. హైదరాలీ, నిజామలీలను మద్రాసు పైకి, భాన్స్లేను కలకత్తా పైకి కవ్వించుదాం. అలా చక్రబంధంలో ఇరికించి ఆంగ్లేయులకు బుద్ధి చెప్పవలసిన తరుణం ఆసన్నమైంది" అన్నాడు నానాఫర్నవీస్.

బారాభాయీలంతా దేశస్వాతంత్ర్యానికి వచ్చిన ఘోరవిపత్తును తొలగించడానికి ఏకోన్ముఖంగా శ్రమించాలని నిశ్చయించారు. ప్రధానంగా మహాదాజీ సైన్యబలమూ, నానాఫర్నవీసు బుద్ధిబలమూ చురుగ్గా పనిచెయ్యనారంభించాయి. మహారాష్ట్ర జాతి అంతా రోషవివశమై పోయింది. ధనికుడు, దరిద్రుడు, పండితుడు, పామరుడు, ఆడ, మగ బాలురు, వృద్ధులు అనే వివక్షతలేకుండా అందరూ ఆంగ్లేయులను ఎదుర్కొనడానికి ముందు వచ్చారు.

పడమటి కనుమలగుండా వచ్చే ఆంగ్లదళాన్ని మహారాష్ట్రులు చాటుమాటున ఉండి ముప్పతిప్పలు పెట్టసాగారు. ఇరుకైన లోయల్లో వారినెదుర్కొని వారి సామగ్రిని క్రమంగా దోచుకొనడం మొదలెట్టారు. ఆంగ్లదళం యుద్ధానికి సన్నద్ధమయ్యేలోగా గుట్టల చాటున క్షణంలో మాయమైపోయేవారు. ఎలాగో కనుమ దిగి పుణే బాట పట్టింది ఆంగ్లదళం. కాని కష్టాలన్నీ అప్పటినుండే రెట్టింపయ్యాయి.

దారిపొడవునా ఉన్న గ్రామాలన్నీ భస్మీపటలమై గోచరించాయి. తలదాచుకొనడానికి ఒక్క నివాసమైనా వారికంట బడటం లేదు. ఎంత డబ్బిచ్చి కొందామన్నా ఒక గింజ కూడా లభ్యం కావడం లేదు. తక్కిన వస్తువుల సంగతి సరేసరి! వెంట తెచ్చుకున్న ఆహార సామగ్రి నానాటికీ తరలిపోతుంది. మంచినీటి బావులు, చెరువులు వాడకానికి వీలులేకుండా చేసిపోయారు మరాఠీలు.

రోజులు భారంగా గడుస్తున్నాయి. మరాఠీల గెరిల్లా దాడుల నుండి తప్పుకుంటూ ఒక్కో మైలు గడవటమే గగనమైపోతోంది. ఏ చెట్టుచాటునుండో, గుట్టమాటునుండో తుపాకి గుళ్ళు దూసుకొస్తున్నాయి.

ఒకరోజు ఓ ఎత్తయిన చెట్టుపై ఎక్కి చుట్టూ పరికిస్తున్న కల్నల్ స్టెవర్ట్ గుండు దెబ్బ తగిలి కూలిపోయాడు. మరో రోజు కల్నల్ కేకు బలమయిన దెబ్బతగిలి మంచం పట్టాడు. దీంతో ఆంగ్ల సైనికులందరి గుండెలు దడదడలాడసాగాయి. యమకూపం లోనికి తెలిసి తెలిసి వచ్చిపడిన తమ అజ్ఞానానికి నిందించుకొనసాగారు. ఇంతలో దళాధిపతి ఎగర్టన్ జబ్బుపడ్డాడు. సైన్యాధిపత్యం కర్నల్ కాక్‌బర్న్‌కు ఒప్పగించి తను భద్రంగా బొంబాయి చేరుకున్నాడు.

సేనలో ప్రతివాడూ రఘునాధదాదాను నిందించసాగాడు. ప్రజలంతా తనకు స్వాగతం పలుకుతారని కోతలు కోసిన వ్యక్తి ఇప్పుడు తలెత్తి చూడలేకుండా ఉన్నాడు. పరువుగా ప్రాణాలతో బయటపడ గలమా అన్న దిగులు పట్టుకుంది ఆంగ్ల దళాధిపతులకు.

ఎలాగో పళ్ళబిగువు మీద వాడ్‌గామ్ దాటి తలేగామ్ చేరు కున్నారు. అక్కడ వారికి మరింత నిస్పృహ ఎదురైంది. గ్రామ తటాకం గట్లు తెగగొట్టబడి వున్నాయి. అంత పెద్ద చెరువులోనూ చుక్క నీరు కూడా లేదు. ఊరంతా దాదాపు నిర్మానుష్యంగా ఉంది. ఏ ఇంటిలోనూ గిద్దెడు గింజలు కూడా లభించలేదు.

తరువాత మజిలీ చించ్‌వాడా మొత్తం దగ్ధంచెయ్యబడివుందన్న వార్త తెలియగానే ఆంగ్ల సర్దారులందరి గుండెల్లో గుర్రాలు పరు గెత్తాయి. ముఖ్యులయిన సేనానులంతా సత్వర సమావేశం జరిపారు. వెనువెంటనే బొంబాయి దారిబట్టి వీలైనంతవరకూ ప్రాణాలు దక్కించుకొనడం ఒక్కటే మార్గం అని తీర్మానించారు. రాత్రికి రాత్రే వెనక్కి బయలుదేరి తెల్లవారేసరికి మళ్ళీ వాడ్‌గామ్ చేరు కున్నారు.

కాని లోయచుట్టూ చెట్టు చెట్టుకూ, పుట్ట పుట్టకూ సాయుధు డైన మరాఠీ సిపాయి ఉండటం గోచరించింది. అందరూ నిస్సహా యంగా నిలిచిపోయారు. విధిలేక కాళ్ళబేరానికి వచ్చారు ఆంగ్లేయులు. కాని 'రఘునాధరావు బేషరతుగా లొంగిపోతేనే సంధి సంప్రదింపులు సాధ్యమవుతాయి' అని మహదాజీ సింధియా, నానాఫర్నవీసు లిద్దరూ నిక్కచ్చిగా తేల్చిచెప్పారు.

సంధి షరతులు తేల్చుకునేందుకు ఫార్మర్ దొర సింధియా శిబిరానికి బయలుదేరాడు. అతని కళ్ళకు గంతలుకట్టి పల్లకీ నెక్కించి సింధియా శిబిరానికి తీసుకుపోయారు.

"దొరగారికి నమస్కారాలు. దయచేయండి" అంటూ ఎంతో మర్యాదగా శిబిరం లోపలికి తీసుకుపోయాడు సింధియా.

అక్కడే నానాఫర్నవీసు, సఖారామ్‌బాపు, హరిపంత్‌ఫడ్‌కే, తుకోజీహోల్కార్ మున్నగు హేమాహేమీలంతా ఆసీనులై ఉన్నారు.

మహారాష్ట్ర సామ్రాజ్య భారాన్ని తమ భుజస్కంధాలపై వహిస్తున్న ఆ ఉన్నత వ్యక్తులకు ఫార్మర్ వందనం చేశాడు.

"మా ముఖ్యమైన షరతులు విన్నారుగదా దొరగారూ?" అన్నాడు సింధియా.

"విన్నాం సింధియా మహరాజ్! కాని శరణుజొచ్చిన ఒక గొప్ప వ్యక్తిని పగవారి కప్పగించడం ఆంగ్లజాతికి తీరని తలవంపులు తెస్తుంది. కనుక తమరు ఈ ఒక్క షరతును వదిలిపేయ ప్రార్థన."

"మీ బలమూ, ఎదిరి బలమూ తెలియకుండా ఆశ్రయం ఇచ్చిన నేరానికి ఈ అవమానం తప్పదు!" కటువుగా పలికాడు నానా.

"ఇంగ్లీషువారి వర్తకవ్యాపారాలకు ఎన్నడూ ఎలాంటి ఆటంకమూ కలిగించలేదు మహారాష్ట్రులు. అట్టిమెడ కేవలం దుర్బుద్ధితో, స్వార్థచింతనతో మా రాజకీయాలలో జోక్యం కలిగించు కొనడం తప్పు అని ఇప్పటికైనా గ్రహించండి. ఇకపై ఎన్నడూ ఇలాంటి సాహసాలకు తలపెట్టక, తోకముడుచుకుని బొంబాయిలో కూచోండి" అన్నాడు హరిపంత్ కళ్ళవెంట నిప్పులు కురిపిస్తూ.

మహదాజీ సింధియా వారందర్నీ కళ్ళతోనే వారించాడు.

"క్షమించండి దొరగారూ! అంగ్లేయుల అనవసర జోక్యానికి భారతజాతి అంతా మండిపడుతోంది. అందువలన ఇలాంటి పరుష వాక్యాలు వెలువడటం ఆశ్చర్యం కాదు. ఇక మా షరతులు వినండి. మొట్టమొదటిదీ, అతి ప్రధానమైనదీ—రఘునాధదాదాను బేషరతుగా మాకు అప్పగించడం. రెండవది—ఆంగ్లేయులు ఆక్రమించిన సాల్‌సెట్టి, థానా తదితర ప్రదేశాలు తిరిగి మహారాష్ట్రులకు ఇచ్చివేయాలి. మూడు—మరాఠీ ఫౌజు నెదుర్కొనడానికి బెంగాల్‌నుండి వచ్చే సైన్యం వెనక్కి మరలిపోవాలి. నాలుగు—పై మూడు షరతులూ నెరవేరేదాకా ఇద్దరు ఆంగ్లేయులు మా దగ్గర పూచీగా పడి వుండాలి. ఈ నాలుగు షరతులకూ ఒప్పుకుంటేనే సంధి సాధ్యం. లేదా, ఏం జరగబోతోందో మీ అంతరాత్మకు తెలుసు."

సింధియా స్వరంలోని కాఠిన్యం, తక్కిన మరాఠీ సర్దారుల చూపుల్లోని క్రూరత పరికించి ఫార్మర్ నోరెత్తటానికి జంకాడు.

"తమ షరతులు దళాధిపతికి నివేదిస్తాను" అంటూ సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

సంప్రదింపులు ఇలా జరుగుతూ ఉండగానే రాత్రికి రాత్రే ఆంగ్ల పటాలం అంతా చుట్టూ ఫిరంగులు పేర్చుకుని తప్పించుకు పోవడానికి ప్రయత్నం చేసింది. కాని తెల్లవారేలోగా మరాఠీ ఫౌజు వారిని చుట్టివేసి నిలవరించింది. అప్పుడు జరిగిన పోరాటంలో యాభై మంది ఆంగ్లేయులూ, నాలుగు వందలమంది సిపాయీలూ నేలగూలారు. దాంతో అన్ని ఆశలూ వొదులుకుని, సంధి పత్రాలపై సంతకాలు చేసి రఘునాధరావును సింధియాకు ఒప్పగించారు ఆంగ్లేయులు.

దాదాతో బాటే ఖరక్‌సింగ్ కూడా సింధియాచేత చిక్కాడు. అతన్ని చిత్రహింసలపాలు చేసి చంపటం జరిగింది.

వెంటనే ఆంగ్లేయులకు కావలసిన ఆహారపానీయాలు సమకూర్చారు. ఇరవై వేలమంది మహారాష్ట్ర సైనికుల వెంట రాగా త్వరలోనే వట్టి చేతుల్తో కొంకణతీరం చేరుకున్నారు ఆంగ్లేయులు. భారతదేశం అంతటా ఆంగ్లేయుల ప్రతిష్ఠ దెబ్బతిన్నది.

మరికొన్ని దినాలకు సింధియా కాపలానుండి తప్పించుకుని మళ్ళీ బొంబాయి చేరుకున్నాడు రఘునాధరావు. వాడ్‌గామ్ సంధిని కాలదన్ని మళ్ళీ యుద్ధానికి పూనుకున్నారు ఆంగ్లేయులు. మహారాష్ట్రులు వెనుకంజ వేయక వారిని ప్రతిఘటించడమే కాక, హైదరాలీని మద్రాసు పైకి పురికొల్పారు. నాలుగేళ్ళు యుద్ధం జరిగాక మళ్ళీ లొంగివచ్చి రఘునాధరావును సింధియాకు ఒప్పగించారు ఆంగ్లేయులు.

# 19

**1783** ఫిబ్రవరి 10వ తేదీన పుణే నగరం ఆనందోత్సాహాలతో కళకళలాడిపోతోంది. పౌరులందరూ సంతోషంతో కులుకుతున్నారు.

ఇక శనివార్‌వాడా సంగతి చెప్పనే అక్కరలేదు.

ఎందుకంటే ఈరోజు తొమ్మిదేళ్ళ శ్రీమంత్ ప్రధాన్ సవై మాధవరావు పీష్వా వివాహమహోత్సవం మిక్కిలి వైభవంగా జరగబోతోంది.

నగర ప్రముఖులతో వాడా అంతా కిక్కిరిసిపోయింది.

గణేశ్ మహల్‌లో వివాహవేదిక అమర్చబడింది.

వధువు రమాబాయి నాలుగేళ్ళ బాలిక.

వారిరువుర్నీ చూసి మహారాష్ట్ర సర్దారులంతా ఆనందబాష్పాలు రాలుస్తున్నారు. మళ్ళీ న్యాయాధీశులైన రామశాస్త్రిగారు ఒక సమున్నత పీఠంపై అధివసించి తన ఆనందాన్ని గంభీరత చాటున మాటు పరుస్తున్నారు.

పుణ్యదంపతులైన రమాబాయి, మాధవరావులను మళ్ళీ వివాహవేదికపై చూస్తున్నట్లే తోచింది వారందరికీ. ముఖ్యంగా పార్వతీబాయికి ఆ వేడుక చూడటానికి రెండు కళ్ళూ చాలటంలేదు. స్వర్గస్థులైన పెద్దలనూ, పిన్నలనూ తలచుకుని ఆమె కంటికి మంటికి ఏకధారగా ఆనందబాష్పాలతోబాటు దుఃఖబాష్పాలు కూడా రాల్చ సాగింది.

వివాహానికి మహారాష్ట్ర సర్దారులంతా విచ్చేసి కానుకలు సమర్పించారు.

సతారానుండి ఛత్రపతి వేంచేశారు.

నిజామ్ జ్యేష్ఠపుత్రుడు అలీజా హైదరాబాద్ నుండి విచ్చేసి వధూవరులను ఆశీర్వదించాడు.

అయితే అందరి కళ్ళూ నానాఫర్నవీసు పైనే కేంద్రీకరించి వున్నాయి.

తొమ్మిదేళ్ళపాటు ఆంగ్లేయులతో పోరాడి, వారి పులుసు పూర్తిగా పిండివేసిన ఉద్దండు డీ బక్కపలచని బ్రాహ్మణుడు! పులుల వంటి సింధియా, తుకోజీ హోల్కార్, మధోజీభాన్స్లే, హరిపంత్, త్రియంబకరావు మామా, పట్వర్ధన్, రస్తే మున్నగు మహారాష్ట్ర సర్దార్లనందర్నీ ఒక గాట కట్టివేసిన మహామేధావి. హైదరాలీ, నిజామలీ వంటి ముస్లిం పాలకులను కూడా ఇంగ్లీషువారి మీదికి

పురికొల్పిన రాజనీతిజ్ఞుడు. కుతంత్ర ఝంఝామారుతంలో చిక్కి అల్లాడుతున్న మహారాష్ట్ర నావను భద్రంగా దరిజేర్చిన నావికుడు. సఫలీకృత ప్రతిజ్ఞుడు.

నేటికాతని వ్యధిత హృదయం నిమ్మళించింది.

పాణిగ్రహణం పూర్తయింది. మంగళతూర్యరావాలు మ్రోగు తున్నాయి.

"నానాజీకి మొక్కు బాబూ!" అంది పార్వతీబాయి. ఆమె కళ్ళనిండా నీళ్ళున్నాయి.

కుమార పీష్వా నానాఫడ్నవీసుకు నమస్కరించబోయాడు.

కాని నానా మాధవరావును వారించాడు.

"శ్రీమంత్! నేను తమ సేవకుణ్ణి. తమరు మాకు పూజ్యులు."

"కాదు నానాజీ! పొత్తిళ్ళలోనే అణగారిపోవలసిన నాకు ప్రాణం పోశారు. కంటికి రెప్పలా కాపాడి మస్నద్ ఎక్కించారు. అహరహమూ శ్రమించి మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని రక్షించారు. తమకంటె మాకు పూజ్యులెవరున్నారు?"

తొమ్మిదేళ్ళ కుమార పీష్వా ప్రదర్శించిన కృతజ్ఞతాభావం సభికులందర్నీ ఆకట్టి వేసింది. విజ్ఞతతో కూడిన అతని పలుకులు వారిని ముగ్ధుల్ని చేశాయి.

"పంత్‌ప్రధాన్ సవై మాధవరావు జిందాబాద్!" అని ఒక్కుమ్మడిగా అరిచారు.

"మీ పూర్వుల వలెనే న్యాయపాలన చెయ్యండి" అని దీవించాడు రామశాస్త్రి.

ఛత్రపతి రామరాజా, మాధవరావు నారాయణ్ పీష్వాను ఆశీర్వదించాడు. "శ్రీమంత్! చిన్నవాడివైనా పెద్ద మాటలు మాట్లాడావు. మీ తాత ముత్తాతల పేరు నిలబెట్టి, మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని విస్తరింపజేస్తావనీ, విదేశీయుల బారినుండి భారతదేశాన్ని రక్షిస్తావనీ ఆశిస్తున్నాను. అన్నిటినీ మించి దేశరక్షకుడై వెలుగొందిన నానా ఫడ్నవీసుగారి సలహాలను జవదాటవలదని కోరుతున్నాను."

"ఆజ్ఞ శిరసావహిస్తాను" అని పలికాడు పీష్వా.

దివంగతులైన పీష్వాలు ఆశీస్సులు కురిపిస్తున్నారా అన్నట్లు కుమార పీష్వాపై పుష్ప వర్షం కురిసింది.

నానాఫర్నవీసు వదనం తృప్తితో వెల్లివిరిసింది.

# 20

పీష్వా పదవిని ఇష్టాపూర్తిగా పరిత్యజిస్తున్నట్లు ప్రకటించి బారా భాయీలకు లొంగిపోయి, కోపర్‌గామ్‌లో నెలకొన్నాడు రఘునాథ రావు దాదా.

అతని హృదయం ఇప్పుడు పశ్చాత్తాపంతోనూ, నిర్వేదం తోనూ నిండిపోతోంది.. తన అధికారకాంక్ష ఎంతటి దారుణాలకు దారితీసిందో తలచుకుని క్రుంగిపోవటం మొదలెట్టాడు.

'ఎన్ని హత్యలు! ఎంత రక్తపాతం!

"దాదాజీ! నా ప్రాణాలు రక్షించు" అంటూ తన పాదాలు పట్టుకుని ప్రాణభీతితో వేడుకున్న నారాయణరావు దీనవదనమే అతని కిప్పుడు అనుక్షణమూ గుర్తుకొస్తోంది.

అంతటి దారుణం ఆచరించిన గార్దీలు అంతా ఏరీ?

సుమేర్‌సింగ్ 1771 లోఇందూర్‌లో దారుణ మరణం పాల య్యాడు. ఖరక్‌సింగ్ 1779 లో వాడ్‌గామ్‌వద్ద తనతోబాటు బారా భాయీలకు దొరికిపోయి, నరికివేయబడినాడు. 1779 లో తులాజీ పవార్ హైదరాలీచేత అప్పగింపబడి చిత్రవధ పాలయినాడు. ఇహ మహమ్మద్ యూసఫ్ అక్కడక్కడా అడవుల్లో దాగివుండి 1775 లో దొరికి వధింపబడినాడు.

ఇలా నారాయణరావు వధలో పాల్గొన్న వారంతా ఏదో విధంగా ప్రతిఫలం అనుభవించారు.

తర్వాత ఆనందీబాయి సంగతి చెప్పనక్కర్లేదు. పరుల పంచనచేరి అష్టకష్టాలూ పడుతోంది.

ఇహ తను?,

నిట్టూర్పు విడిచాడు రఘునాథరావు.

'భగవాన్? ఈ దుష్టుడి పాపాలకు నిష్కృతిలేదు. అసలు ఈ వికృష్టుడే మహారాష్ట్ర సామ్రాజ్యం పాలిటి ధూమకేతువు.

అన్న బాలాజీరావు తనను ఎంత ఆదరంగా చూసేవాడు! తన తప్పుల్ని ఎన్నింటినో సహించాడు. పాపం! పానిపట్టు ఓటమి తరువాత దిగులుతో మంచంపట్టి తనను దగ్గరకు పిలుచుకుని, "తమ్ముడూ! నేను వెళ్ళిపోతున్నాను. ఇక మరాఠీ రియాసత్‌కు నువ్వే దిక్కు. పసివాడు మాధవరావును నీచేత పెడుతున్నాను. ఏం చేస్తావో!" అంటూ కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

కాని తను ద్రోహి. అన్న మరణించగానే పీష్వా పదవికోసం కొట్లాడాడు. సమర్థుడయిన మాధవరావు తన ఆటలు సాగనీయలేదు. అయితే మాధవరావూ చిన్న వయస్సులోనే మరణిస్తూ, నారాయణరావును తనకప్పగించిపోయాడు.

అన్న సంతానంలో మిగిలిన నలుసు నారాయణరావును కాస్తా తను...' ఇక ఆపైన గుర్తు తెచ్చుకొనడానికి భయపడ్డాడు దాదా.

హఠాత్తుగా వదిన గోపికాబాయి గుర్తుకొచ్చిందతనికి.

వీరాధివీరులయిన ముగ్గురు కొడుకుల్ని కోల్పోయిన ఆమె హృదయవేదన తలచి, ఆ హృదయవేదనకు తనే కారకుడన్న విషయం స్ఫురించి నిలువున నీరైనాడు.

"మానాజీ!"

"దాదాసాహబ్!" అన్ని కష్టసుఖాల్లోనూ అతని వెన్నంటి వున్న మానాజీ సవినయంగా తలవంచాడు.

"వదినెగారిప్పుడెక్కడున్నారు?"

"నాసిక్‌లో ఉన్నారట!"

"ఎలా ఉన్నారో?"

"మొదట్లో కొంత మనశ్చాంచల్యం కలిగిందట. కాని ఇప్పుడు ప్రశాంతంగా కాలం గడుపుతున్నారట!"

"ఒక్కసారి ఆమె దర్శనంచేసి క్షమాపణ కోరకపోతే ఈ జీవికి మనశ్శాంతి లభించేట్లులేదు మానాజీ!"

దాదా స్వరం గద్గదమైపోవటం గమనించి మానాజీ నివ్వెరపోయాడు.

"అదెంత పని సర్కార్! నేరుగా నాసిక్ వెళ్ళి వారి దర్శనం చేసుకుందాం."

"అలాకాదు మానాజీ! మొదట నువ్వు వెళ్ళి ఆమె అనుమతి తీసుకుని రావాలి. నేరుగా వెళ్ళి కంటబడితే పుత్రశోకంచేత క్రుంగిపోతున్న ఆమె శపించగలదని నాకు సందేహంగా వుంది."

"అలాగే వెళతాను సర్కార్!"

మానాజీ ఆరోజే నాసిక్‌కు వెళ్ళాడు.

గోపికాబాయి అక్కడ ఆశ్రమంలో సర్వసంగ పరిత్యాగినిపై కాలం గడుపుతోంది.

మానాజీ ఆమె పాదాలకడ మోకరిల్లాడు.

"తమ మరదిగారు రఘునాధదాదా తమ దర్శనం కొరకు పరితపిస్తున్నారు. తమ అనుమతి వేడమని నన్ను పంపారు."

గోపికాబాయిని క్షణకాలం ఉద్వేగం ఆవహించింది.

"పుత్ర హత్యకు పశ్చాత్తాపపడుతున్నాడా?"

"అవును తల్లీ! క్షణక్షణమూ క్రుంగిపోతున్నారు. తమ దర్శనం చేసి క్షమాపణ వేడనిదే జీవించలేరు."

"అలా కాదు. గోదావరి నదిలో మునిగి బ్రాహ్మణ సమాజం ఎదుట ప్రాయశ్చిత్తం చేసుకుని, సర్వ పాపాలూ క్షాళనం చేసుకున్న తరువాత రావొచ్చునని చెప్పు" అని పూజలో నిమగ్నమైపోయింది గోపికాబాయి.

మానాజీ కోపర్‌గామ్ వెళ్ళి ఆమె పలుకుల్ని దాదాకు విన్నవించాడు.

రఘునాధరావు ప్రాయశ్చిత్తానికి వెంటనే అంగీగరించాడు. గోదావరి నదీతీరాన పూజ్యులైన బ్రాహ్మణుల ఎదుట ప్రాయశ్చిత్తం చేసుకున్నాడు.

"మా అన్నగారి కుమారుడైన నారాయణరావును నిర్బంధించటానికి గార్దిలను ప్రోత్సహించిన మాట నిజమే. కాని అతని హత్యలో మాత్రం నాకు ఎట్టి ప్రమేయమూ లేదని పవిత్రగోదావరి జలాలనంటి ప్రమాణం చేస్తున్నాను" అని ప్రకటించాడు.

కర్మకాండ అంతా పూర్తి అయ్యాక గంగాపూర్‌వద్ద గోపికా

బాయిని సందర్శించాడు. ఆమె పాదాలకు సాష్టాంగదండ ప్రణామం చేశాడు.

"వదినా! ఈ పాపిని మనసారా క్షమించు. ఈ మనోవ్యాధితో నేను అట్టే కాలం బ్రతకను. నీ పవిత్రహస్తంతో ఆశీర్వదించకపోతే నాకు ముక్తి లేదు" అంటూ విలపించసాగాడు.

తుఫానులోని ఆకువలె సంచలించి పోతున్న మరిదిని చూసి గోపికాబాయికి దుఃఖం కట్టలు తెంచుకుంది.

అతని తలపై చేయి ఉంచి లేవనెత్తింది.

"బాబూ! నా పుత్రులొకటీ, నువ్వొకటీ కాదు. నిన్ను మనసారా మన్నిస్తున్నాను. గతించినదాన్ని పూర్తిగా మరిచిపోయి, దైవధ్యానంతో ప్రశాంతంగా నూరేళ్ళు జీవించు."

"అంతమాటనకు వదినా! ఈ అపవాదుతో, ఈ గుండె బరువుతో నూరేళ్ళు నరకం అనుభవించలేను. నేను ఎంత తొందరగా దాటిపోతే నాకూ, దేశానికీ అంత మంచిది. నువ్వు మనసారా క్షమాభిక్ష ప్రసాదించావు. అంతే చాలు—సెలవు" అంటూ ఆమె పాదాలకు మళ్ళీ మొక్కి, కోపర్‌గామ్ వెళ్ళిపోయాడు.

తన అధికార కాంక్షచే పీష్వా నారాయణరావు వధకు కారకుడై, మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని అల్లకల్లోలం గావించి, దేశ ప్రజలందరి శాపవాక్కులకూ గురైన రఘునాథరావు దాదా మరో నాలుగు నెలలకు తన 48వ ఏట భారంగా కన్నుమూశాడు.

—: అయిపోయింది :—



79a

# పీష్వాల వంశ వృక్షం

- బాలాజీవిశ్వనాధ్
  - బాజీరావు 1
    - బాలాజీరావు × గోపికాబాయి
      - విశ్వాసరావు
      - మాధవరావు
      - పీష్వానారాయణరావు × గంగాబాయి
        - మాధవరావు నారాయణ్
    - రఘునాధరావు × ఆనందీబాయి
  - చిమ్మాజీ అప్పా
    - సదాశివభావో × పార్వతీబాయి

## మా వద్ద స్టాకులో వున్న నవలలు

| | |
|---|---|
| మాయదారిపిల్ల (రెండు భాగాలు) | నిశీధ చక్రవర్తి |
| వీరప్రతిజ్ఞ | అగ్నిశిఖ పిశాచాలు |
| వీరసింహుడు | విజయచంద్రుడు |
| బంగారు హంసలు | రాజశేఖరుడి శపథం |
| ఆకాశసౌధం | వెన్నెల రాకాసి |
| గండరగండడు | విజయసింహుడి అద్భుత యాత్రలు |
| సింద్‌బాద్ (రెండు భాగాలు) | మాయసన్యాసి |
| గలివర్ (రెండు భాగాలు) | మరకతమంజూష |
| అల్లావుద్దీన్ (రెండు భాగాలు) | విప్లవవీరుడు |
| మృత్యులోయ (రెండు భాగాలు) | మందారబాల |
| ఆలీబాబా 40 దొంగలు | భూతాలరాజు |
| అపూర్వ సహోదరులు | పాండురంగడు-పదుగురుదొంగలు |
| కుంటి కోతి కథ | మరకత మకుటం |
| భీష్మ (రెండు భాగాలు) | అమృత లహరి |
| బానిస పిల్ల | ఇంద్రపదవి |
| వసంతసేన | వృషభాసురుడు |
| బడాయి వ్యాపారి | బంధిపోటు భవానీసింగ్ |
| ఖలీఫాల గుప్తధనం | మంత్రి గడ్డంలోని మర్మం |
| దయ్యాలు చేసిన పెళ్ళి | వింత పక్షులు |
| నకిలీ ఖలీఫా, పజిల్స్ | మహామాంత్రికురాలు |
| వెర్రి వెంగళప్ప కథలు | వింత రాక్షసులు |
| కొంగగా మారిన ఖలీఫా | పచ్చల హారం |
| ప్రతాపసింహ, రాక్షస మాయ | విక్రమ విజయం |
| భూతాల లోయ, వజ్రకవచం | మంత్ర పుష్పం |
| రత్నాల లోయ | నాగకుమారుడు |

వివరాలకు :

బొమ్మరిల్లు పబ్లికేషన్స్

80-ధనలక్ష్మి కాలనీ మద్రాసు-600026.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M139 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 10 |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | G. Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |